# ఇరుగు - పొరుగు

[ నాటకం ]

రచన :

"శరత్ బాబు"

అనువాదం :

"కేరా"



పబ్లిషర్సు:

గుండిమెడాస్, ఏలూరు

 [ రు. 1-4-0

వేయి ప్రతులు
1953

అంకితం :

"అమ్మకు"



జెమిని ప్రింటర్స్,
పవరు పేట, ఏలూరు

# పాత్రలు

| | | |
|---|---|---|
| వేణీఘోషాల్ | ... | జమీందార్ |
| రమేశ్ ఘోషాల్ | ... | వేణీ పినతండ్రి కొడుకు |
| మధుపాల్ | ... | వర్తకుడు |
| వనమాలి | ... | హెడ్మాస్టర్ |
| యతీంద్ర | ... | యదునాద ముఖర్జీ చిన్న కొడుకు, రమ తమ్ముడు |
| గోవిందగంగూలీ | ... | గ్రామస్థులు |
| ధర్మదాసు | ... | |
| భైరవ ఆచార్య | ... | |
| దీనానాధ్ భట్టాచార్య | ... | |
| షష్టీచరణ్ | ... | |
| పరాణ్ హాల్దార్ | ... | |
| భజువా | ... | రమేశ్ కు దర్వాన్ |
| గోపాల్ | ... | రమేశ్ కు గుమాస్తా |

మిఠాయి వ్యాపారి, నౌకరు, బెనర్జీ, రైతులు, అక్బర్, గౌహర్, ఉస్మాన్, జగన్నాథ్, నరోత్తమ, దర్వాన్ మొదలగువారు.

★

| | | |
|---|---|---|
| రమ | ... | |
| విశ్వేశ్వరి | ... | (పెద్దమ్మ) |
| రమ పినతల్లి | ... | |
| కుముద | ... | దాసీలు |
| రాధ | ... | |

★

| | | |
|---|---|---|
| లక్ష్మి | ... | భైరవుని చిన్నకూతురు |

D

## నటీనటులకు—

ప్రదర్శన కనుకూలంగా యీ నాటకంలో కొద్దిమార్పులు చేయబడ్డాయ్. స్త్రీ పాత్రలు మొత్తం ఐదు. కాని రెండు పాత్రలతో నాటకం ప్రదర్శించవచ్చు. దాసీ పాత్రలు రెండు స్టేజిమీదకు రానవసరంలేదు. వారి సంభాషణలను తెరవెనుక నుంచే వినిపించవచ్చు. ఇక మిగిలేది రమ పినతల్లి పాత్ర. పెద్దమ్మగా నటించే నటి వేష ధారణలో తగు మార్పులతో యీ పాత్రనుకూడా నిర్వహించవచ్చు.

ఈ నాటక ప్రదర్శనకు అనుమతిపొందనవసరంలేదు. ప్రదర్శనకు ముందు తెలియపరచితే కృతజ్ఞుణ్ణి. ఏవిధమైన మార్పులు చేయకూడదు.

హిందీ మాతృక – 1949 లో

తర్జుమా :

' కేరా '

# ఇరుగు పొరుగు

## ప్రథమాంకము

### మొదటి దృశ్యము

(స్వర్గీయ యదునాథ్ ముఖర్జీ యింటి వెనుకభాగం... దొడ్డితలుపు తీసివుంటుంది. ఎదురుగా చిన్నదారి ఉంది. పెరట్లో నాలుగువైపులా... మామిడిచెట్లు, పనసచెట్లు పెరిగిఉన్నాయ్... కొంచెం దూరంలో చెరువు రేవు మెట్లు కనపడుతుంటాయ్... ఉదయకాలం... రమ, ఆమె పినతల్లి స్నానానికని బయటకు వస్తూంటారు... సరిగా అదే సమయానికి రెండవ ప్రక్కనుంచి వేణీ ఘోషాల్ వస్తాడు. రమవయస్సు ఇరవైరెండు, లేక ఇరవై మూడు ఉంటుంది. చిన్నతనంలోనే విధవరాలయింది. చేతులకు కొన్ని గాజులున్నాయ్... సన్నంచు చీర కట్టుకుని ఉంటుంది... వేణీ వయస్సు ముప్పై అయిదు, లేక ఆరుకంటె ఎక్కువ ఉండదు.)

వేణీ :-రమా, నీదగ్గరకే వస్తున్నాను.

రమ పినతల్లి :-కాని... నాయనా దొడ్డిదారిని వస్తున్నావేం ?

రమ :-పిన్నీ నువ్వు భలేదానివి. పెద్దన్నయ్య మనింట్లో మనిషి. ఆయనకు వీధివాకిలైతేనేం, దొడ్డిగుమ్మం ఐతేనేం ? ఏం అన్నయ్యా ఏమన్నా పనుందా ? ఐతే లోపలికి వెళ్ళి కూర్చో... నేను ఇప్పుడే ఒక మునుగు మునిగి వస్తాను.

వేణీ :-కూర్చోటానికి తీరిక ఏదమ్మా... ఎన్నో పనులున్నాయ్... ఆ విషయంలో ఏంచేయదలచుకున్నావో, నిశ్చయించుకున్నావా ?

రమ :-ఏ విషయం అన్నయ్యా ?

వేణీ :-అదే... మన పినతండ్రిగారి శ్రాద్ధ కర్మవిషయం. రమేష్ నిన్న వచ్చాడు. తన తండ్రిగారి శ్రాద్ధకర్మ ఎంతో అట్టహాసంగా చేస్తాడట, నువ్వు వెడతావా ?

రమ :-నేను వెడతానా ?...తారిణీఘోషాల్ యింటికా ?

వేణీ :-అవునమ్మా, ఇది నాకు తెలుసు... ఎవరు వెళ్ళనీ, ఎవరు వెళ్ళకపోనీ, నువ్వు ఏ పరిస్థితుల్లో కూడా ఆ యింట్లో అడుగు పెట్టవని నాకు తెలుసు. కాని ఆ వెధవ యింటింటికీవచ్చి స్వయంగా పిలుస్తాడని విన్నాను. ఇలాంటి వెధవపనుల్లో, వాడు తండ్రిని మించిపోతాడు. ఒకనేళ వాడు నిజంగా ఇక్కడకే వస్తే, నువ్వు ఏం చేస్తావ్ ?

రమ :-నేనేం అనను అన్నయ్యా...బయట దర్వాన్ జవాబు చెప్తాడు.

పిఃతల్లి :-దర్వాన్ జవాబు చెప్పటం దేనికి ? నాకేం చెప్పటం చాతకాదనుకున్నావా ? వెధవకు పెట్టవలసిన చీవాట్లు నాలుగూ పెడతాను. మళ్ళీ యీ యింటి ముందు మొగంకూడా చూపించడు. తారిణీ ఘోషాల్ కొడుకు మన యింటికి విందుకు పిలవటానికి రావడమా ? నేనేం మరచి పోలేదు వేణీ... తారిణీ యీ పిల్లవాడికిచ్చే మన రమ పెళ్లిచేయాలనుకునేవాడు. అప్పటికి యింకా యతీంద్రుడు పుట్టనే లేదు. ఈ విధంగా ముఖర్జీ ఆస్తి అంతా చేతిలోకి వస్తుందనుకున్నాడు. తెలిసిందా వేణీ ?

వేణీ :-ఆ... తెలియకేం పిన్నీ... అంతా పూర్తిగా తెలుసు.

పినతల్లి :-అవును... నాయనా... తెలియకుండా ఎందుకుంటుంది ? ఇది మామూలు విషయమా—ఎప్పుడైతే, తను అనుకున్న విధంగా జరగలేదో, అప్పుడు యీ భైరవాచార్యులతో కలిసి, ఏ మంత్ర తంత్రాలు చేయించాడో అమ్మాయి అదృష్టం యిలా మండి బూడిదయింది. ఆరు నెలలు గడిచాయో లేదో అమ్మాయికి మొగాన్ని కుంకుమ, చేతులకు గాజులు పెట్టుకునే యోగ్యత నాశనమయి పోయింది. యదుముఖర్జీ కూతుర్ని తన కోడలు చేసుకుందా మనుకున్నాడు నీచుడు ; పట్టణానికి దావాకని వెళ్లాడు...మళ్లీతిరిగి యింటికే రాలేక పోయాడు. ఒక్కడే కొడుకు... వాడిచేత దహనం చేయించుకునే యోగ్యతకూడా లేకుండాపోయింది. ఇలాంటి నీచులనోట్లో నిప్పు...

రమ :-పిన్నీ... నువ్వు ఒకరిని నీచులని తిట్టడం దేనికి ? తారిణీ ఘోషాల్ పెద్దన్నయ్యకు సయానా పినతండ్రి. బ్రాహ్మణుడ్ని నీచుడంటావా ? నీ నోటికి హద్దూపద్దూ అంటూ లేదు.

వేణి :-(కొంచెం సిగ్గుపడి) కాదు రమా...పిన్ని సరిగానే అంది. నువ్వెంతటి కులీనవు పిల్లవి... సరేగాని చెల్లీ... నిన్ను మా యింటికి తీసుకు రాగలమా? పినతండ్రిగారి నోటివెంట యీ మాట వెలువడటమే సమంజసంగా లేదు. ఆ మంత్ర తంత్రాల విషయం అంటావా అదీ నిజమే...పినతండ్రి, భైరవాచార్యులకు యీ ప్రపంచంలో చేయలేని పని అంటూ యేదీలేదు. రమేశ్ రావటంతోనే యీ వెధవ వాణ్ణి కలుసుకుని అంతరంగికుడై కూర్చున్నాడు.

పినతల్లి :-వేణీ...ఇదంతా అందరికీ తెలిసిన విషయమే. ఆ వెధవ పది పన్నెండు సంవత్సరాలవరకు యింటికి తిరిగి రానేలేదు. వాడి మామ వచ్చి కాశీకి తీసుకుపోయాడో ... లేక మరెక్కడికో ... మళ్ళీ యెప్పుడూ తిరిగి యిక్కడికి రానియ్యనేలేదు. ఇన్నాళ్ళు యెక్కడున్నా డంటావ్? ఏంచేస్తున్నాడు?

వేణి :-బాగుంది పిన్నీ... ఇవన్నీ నాకేం తెలుసు? పినతండ్రిగారితో మీకు యెలాంటి పొత్తుండేదో, మాకూ అంతేగా ... ఇన్నాళ్ళూ బొంబాయిలోనో యెక్కడో ఉన్నాడని విన్నాను. డాక్టరీ ప్యాసయ్యాడని కొంతమంది, వకీలని కొంతమంది, ఆ ... యిదంతా వట్టి పుకారని యితరులు అంటున్నారు. అదీకాకుండా వాడు వట్టి త్రాగుబోతు. ఇంటికి వచ్చినపుడు వాడి కళ్ళు చింతనిప్పుల్లా యెర్రగా ఉన్నాయి...

పినతల్లి :-ఆ... ఇంతవరకు వచ్చిందా? ఐతే యింట్లోకి వాడిని అడుగే పెట్టనియ్యకూడదు.

వేణి :-అసలే పనికిరాదు... ఏం రమా, నీకు రమేశ్ జ్ఞాపకం ఉన్నాడా?

రమ :-(కొంచెం సిగ్గుతో చిరునవ్వు నవ్వుతూ) పెద్దన్నయ్యా, ఇది నిన్న మొన్నటి విషయం... ఆయన నాకంటే నాలుగేళ్ళ పెద్ద... ఒకే బళ్ళో చదువుకున్నాం...ఒకచోట ఆడుకున్నాం...నేను ఎప్పుడూ వాళ్ళ యింట్లోనే ఉండేదాన్ని. పిన్ని నన్ను కన్నకూతురులాగా చూసుకునేది.

పినతల్లి :-దాని చూడటం తగులడిరి... ఆ యిష్టం అంతా తన ఉద్దేశ్యాన్ని పూర్తిచేసుకోవటానికే ... నిన్ను మోసం చెయ్యటానికి వాళ్ళు వల పన్నారు. రమేశుడి తల్లి అయినా యెంత జిత్తులమారిని?

వేణీ :-ఇందులో సందేహం యేముంది ? చిన్న పిన్ని కూడా...

రమ :-ఇదిగో, పిన్నీ... మీరు యిష్టంవచ్చినట్లు యేమన్నా అనండి... కాని నా పిన్ని స్వర్గములో ఉంది ... ఆవిణ్ణి యెవరు తిట్టినా సరే నేను సహించలేను.

పినతల్లి :-ఏమిటే అంటున్నావ్ ? ఒక్కసారిగా యిలా...

వేణీ :-ఆ... ఇది నిజమే...నిజం...చిన్న పిన్ని పెద్దయింటి పిల్ల... ఆవిడ ప్రసంగం వస్తేసరి, యిప్పటికీ, అమ్మ కళ్ళ నీళ్ళు పెట్టుకుంటుంది. సరే... ఇప్పటికి యిది వదిలేద్దాం... ఐతే అదే నిశ్చయం కదమ్మా చెల్లీ ? మళ్ళీ యిందులో అటూ యిటూ యేం జరుగదుగా ?

రమ :-(నవ్వి) జరుగదు...పెద్దన్నయ్యా, నిప్పు, అప్పు, శత్రువు వీటి శేషం ఉండకూడదని నాన్న అంటూండేవారు. తారిణీఘోషాల్ బ్రతికుండగా మమ్మల్ని యేమీతక్కువ హింసపెట్టలేదు... నాన్నగారిని కూడా జైలుకు పంపాలనుకున్నాడు. నేనేం మరచిపోలేదు పెద్దన్నయ్యా...బ్రతికుండగా యికముందు మరచిపోనుకూడా...రమేశ్ ఆ పగవాని కొడుకు. మనం వెళ్ళం ... మనతో సంబంధం ఉన్నవాళ్ళనికూడా వెళ్ళనివ్వం.

వేణీ :-ఇదే కావాలి ... నీకు సరియైన మాట కూడ యిదే ...

రమ :-ఏం పెద్దన్నయ్యా ... ఏ బ్రాహ్మణుడుకూడా ఆ యింటికి వెళ్ళకుండా చెయ్యటానికి ఉపాయం లేదూ ... అప్పుడయితే ...

వేణీ :-అరే...చెల్లీ నేను అదే చేయబోతున్నా. నువ్వు నాకు సాయంచేస్తే చాలు నాకే చింతాలేదు. రమేశ్ యీ కుదాప్యూర్ నుంచి పారిపోయేట్లు చెయ్యకపోతే నా పేరు వేణీ ఘోషాల్ కాదు. ఆ తర్వాత మిగులుతాం, నేను, ఆ వెధవ ఆచార్యులు. పినతండ్రీ యిప్పుడు లేనే లేడు... చూస్తాగా వాణ్ణి ఎవరు రక్షిస్తారో...

రమ :-(నవ్వి) ఈ రమేశ్ ఘోషాల్ వాణ్ణి రక్షిస్తాడనుకుంటూ... పెద్దన్నయ్యా, మనతో యీ పోట్లాటలో ఆయనకూడా ఏమీ వెనుకంజ వేయరు.

వేణీ :-(ఇటూ అటూ చూచి) కొంచెం కంఠస్వరం తగ్గించి) రమా ! అసలు

విషయం ఏమిటంటే, వాడికి డబ్బు దస్కం, ఆస్తిపాస్తుల విషయం యేమీ తెలియదు. సమూలం ఊడ పెరికి పారవేయాలంటే యిదే సమయం...ఒకనేళ ముదిరిందా—దాన్ని మనం కదపలేం. వాడు తారిణీఘోషాల్ కొడుకనే విషయం నువ్వు రాత్రింబగళ్ళు జ్ఞాపకం ఉంచుకోవాలి. సరిగా స్థావరం యేర్పరచుకున్నాడా...

(రమ ఉలిక్కిపడుతుంది. వెంటనే గుమ్మంలోనుంచి రమేశ్ లోపలికి ప్రవేశిస్తాడు. జుట్టు చిందరవందరగా ఉంటుంది. కాళ్లకు చెప్పులు లేవు. దుప్పటి తలకుచుట్టుకుని ఉన్నాడు. వేణిని చూడటంతోనే...)

రమేశ్ :-అరే! పెద్దన్నయ్య యిక్కడే ఉన్నారే? బాగానేఉంది, పదండి. మీరంతా లేకపోతే యిదంతా యెవరుచేస్తారు. నేను ఊరంతా మీ కోసం వెదుకుతున్నా...రాణి యేదీ? ఇంట్లో యెవరూ లేనట్టుంది. దాసీది యిటునైపే వెళ్ళిందని చెప్పిందే...

(రమ తలవంచుకుని నిలబడి ఉంటుంది. ఆమెనుచూచి వెంటనే...)

రమేశ్ :—అరే యిక్కడనేఉంది. ఇంత పెద్దదానివయిపోయావ్...... బాగున్నావా? బహుశా నన్ను గుర్తుపట్టలేదనుకుంటా. నేను నీ రమేశ్‌ని...

రమ :-(తలఎత్తి అతనివైపు చూడకుండానే, మృదుస్వరంతో) మీరు కులాసాయేనా?

రమేశ్ :-ఆ...కులాసాగానే ఉన్నా. కాని రాణీ, నన్ను 'మీరు' అని పిలుస్తున్నావేం? (వేణీవైపుచూసి) పెద్దన్నయ్యా, రమమాట ఒకటి నేను యెప్పటికీ మరచిపోలేను. మాఅమ్మ చనిపోయినప్పుడు, రమ చాలా చిన్నపిల్ల. కాని అప్పుడు నా కళ్ళనీళ్లు తుడుస్తూ అందిగదా "రమేశన్నయ్యా, ఏడవకు. మా అమ్మ ఉందిగా. మన యిద్దరం పంచుకుందాం" బహుశా నీకు యీ మాట జ్ఞాపకం లేదనుకుంటా. ఏం, జ్ఞాపకంలేదు కదూ? పోనీ, మా అమ్మయినా గుర్తుందా?

(రమ యేమీ జవాబివ్వదు. సిగ్గుతో తల బాగా క్రిందకు వంచుకుంటుంది)

రమేశ్ :-కాని యిక సమయంలేదు, ఏం చెయ్య దలచుకున్నావో, చెప్పు.

ఎవరికైనా తే పూర్తిగా నిరాశ్రయు డంటారో - అలాంటివాడయి నీ గుమ్మంలోకి వచ్చాను. మీరు రానట్లయితే, ప్రయత్నాలేవీ జరగనే జరగవు.

పినతల్లి :-(రమేశ్ దగ్గరకువచ్చి, అతని మొగంలోకి చూస్తూ) ఏంనాయనా... నువ్వు తారిణీఘోషాల్ కొడుకువి కామూ...

(రమేశ్ ఆశ్చర్యంతో ఊరికే చూస్తూంటాడు)

పినతల్లి :-ఇంతకు ముందు నువ్వు నన్నెప్పుడూ చూడలేదు. అందుకని నన్ను గుర్తుపట్టలేవు నాయనా...రమకు సరూన పినతల్లిని. కాని ఇంతవరకు నీలాంటి సిగ్గుమాలినవాడిని నేను యెక్కడా చూడలేదు. తండ్రీలాగే కొడుకూ తయారయాడు. మాటాలేదు...మంతీలేదు...ఒక్కసారిగా దొడ్డిగుమ్మాన యింట్లో ప్రవేశించి, యిలా గడబిడ చేయటానికి నీకు సిగ్గులేదూ ?

రమ :-పిన్నీ...యేమిటి వాగుతున్నావ్ ? స్నానానికి పోరాదూ...

పినతల్లి :-కాదు రమా...నేనేం వాగటంలేదు. చెయ్యవలసిన పనిలో మనిషి మొగం చూసినతర్వాత సంకోచించే గుణం నాలో లేదు. బాగానే ఉంది—వేణి యిలా పారిపోవటం దేనికి ? "నాయనా మేము నీ నౌకరు గుమాస్తాలం కాము. నీ జమీందారీ బానిసలం అంతకంటె కాము— నీయింట్లో నీళ్ళుమోసి పిండివిసరటానికి. తారిణి చచ్చాడంటే ప్రజల మనస్సు చల్లబడింది," అని నాలుగు ముక్కలూ చెప్పి వెడితే బాగుండి పోయేదిగా. ఈ మాటలు అనే భారం మనిద్దరి ఆడవాళ్ళ నెత్తిమీదపడేయకుండా తనే అంటే, మగవాడనిపించు కునేవాడు.

(రమేశ్ కదలకుండా శిలావిగ్రహంలా నిలబడిపోయిఉంటాడు.)

పినతల్లి :-ఏమైనా కానీ నేను బ్రాహ్మణుల పిల్లవాడ్ని నౌకర్లు చాకర్లచేత అవమానించను. కొంచెం బుద్ధితెచ్చుకొని మెసలు నాయనా. పరాయి వాళ్ళ యిళ్ళల్లో దూరి యిచ్చకాలు ఆడటానికి నువ్వేం పాపాయివి కావు. నీ యింటికి మా రమ వచ్చి కాళ్ళుకూడా కడుక్కోదు. పూర్తిగా చెప్పేశాను...

రమేశ్ :-రమా... అమ్మ నిన్ను రాణీ అని పిలుస్తుండేది. చిన్నతనపు ఆ

మాటలు యింకా నాకు బాగానే జ్ఞాపకం ఉన్నాయ్. నాయింటికి నువ్వు రావటానికికూడా వీలులేదని నాకు తెలియదు. రమా... తెలి యని తనంవల్ల అపరాధం జరిగింది...నన్ను క్షమించు...
(రమేశ్ వెళ్ళిపోతాడు. వేణీ తిరిగి వస్తాడు. అతని ముగంలో సంతో షం తాండవిస్తూంటుంది?)

వేణీ :-భలే పిన్నీ...మా బాగా అన్నావ్...ఇలాఅనటం మాతోమా... రమా...ఇలాగ నౌకర్లు చాకర్లవల్ల ఏమన్నా సాధ్యమయ్యేదా? నేను చాటునఉండి చూస్తున్నాగా...వెధవ ఆషాఢమాసపు కారుమేఘం లాగ మొగం పెట్టుకొని చక్కాపోయాడు...మా బాగా జరిగింది.

పినతల్లి :-ఆ బాగానే జరిగింది. కాని నాయనా యీ భారం ఆడవాళ్ళ నెత్తినపెట్టి పక్కకు చల్లగా జారుకోకుండా నువ్వే స్వయంగా అంటే యెంతయినా బాగుండేది. ఒకవేళ అనలేకపోయినా, కనీసం యెదు రుగా నిలబడిఉంటే నేను ఏమేమి అన్నదీ వినయినా ఉండువుగా ..

రమ :-పిన్నీ నువ్వేం దిగులుపడకు...ఆయన వినకపోయినా, నేను అంతా విన్నాను. ఎవరు యెంత అనగల్గినా, నువ్వుతప్ప మరొకళ్లు యిలా విషం వెళ్ళగక్కలేరు.

పినతల్లి :-ఏమిటే...ఏమంటున్నావ్ ?

రమ :-ఏంలేదు. ఇవ్వాళ వంటాగింటా ఏమన్నా ఉందా అని అంటున్నా... వెళ్ళు స్నానంచేసిరా...

(రమ తొందరగా చెరువువైపు వెళ్ళిపోతుంది)

వేణి :-ఏం పిన్నీ!...అసలు విషయం యేమిటి ?

పినతల్లి :-ఏంచెప్పను నాయనా...యీ మహారాణి స్వభావం తెలుసుకోవటం నాలాంటి కూలిఃముండలకు సాధ్యమా?....

(నిష్క్రమణ).



(గోవింద గంగూలీ ప్రవేశం)

గోవింద :-ఆ...దొరికారు... వేణీబాబు యెక్కడున్నారా అని ప్రొద్దుటి నుంచీ ఊరంతా గాలించి వేస్తున్నా...సంగతి సందర్భాలు ఏమన్నా విన్నారా? అబ్బాయిగారు నిన్న రావటంతోనే నందీ యింటికి పరుగెత్తుకు వెళ్లాడు. నాలుగురోజుల్లో ఆయన సర్వనాశనం కాకపోతే నా పేరు మార్చి మారుపేరు పెట్టు. ఇక శ్రాద్ధకర్మకు జరిగే సన్నాహం చూస్తే ఆశ్చర్య పోవలసిందే...తారిణీఘోషాల్ చచ్చేటప్పుడు ఒక్క పైసాకూడా మిగల్చకుండా పోయాడని, విన్నాను. మరి యీ అట్టహాసమంతా యేంచూసుకుని...చేతిలో ఉంటే చెయ్యొచ్చు...లేకపోతే మానెయ్యొచ్చు...కాని ఆస్తి తాకట్టుపెట్టి ఇలా తండ్రి శ్రాద్ధకర్మ చేసేవాణ్ని నేను యెక్కడా చూడలేదు. వేణీబాబు యీ కుర్రాడు నందీ దగ్గరనుంచి కనీసం ఐదువేలన్నా తీసుకొచ్చి ఉంటాడు...సందేహం లేదు.

వేణి :-అరే...ఏమంటున్నావ్? ... ఐతే గోవిందబాబాయ్ మా బాగా జాడ తీశావ్...

గోవింద్ :-(కొంచంగానవ్వి) నాయనా...ధైర్యంగాఉండు...నన్ను ఒక్కసారి లోపలికి దూరనియ్యి...అప్పుడు చూద్దువుగాని...వాడి లోపలి విషయంకూడా తెలుసుకుని వస్తానో లేదో... అప్పుడే గోవింద గంగూలీ అంటే ఏమిటో తెలుసు కుంటువుగాని... ఈ లోగా నువ్వు ఎన్నెన్ని మాటలో వినాల్సి వస్తుంది. ఎన్నో పుకార్లు పుట్టిస్తారు ప్రజలు ... కాని నీకు బాబాయ్ పూర్తిగా తెలుసుగా ... ఇది మనస్సులో ఉంచుకో...నేను యింకేమీ చెప్పను.

వేణీ :-రమ దగ్గరకు వెళ్ళాను...

గోవింద :—ఆ...నాకు తెలుసు...ఏమంది ?

వేణీ :-వాళ్లు వెళ్ళనేవెళ్ళరు ... వాళ్ళ తరపు మనుష్యుల్నికూడా వెళ్ళనివ్వరు...

గోవింద :-బస్...బస్...ఇంకేం చూడనక్కరలా...

వేణి :-కాని...మీరు...

గోవింద :-అరే... నాయనా నువ్వు కంగారు పడతావేం? ముందు నన్ను దూరనియ్యి— మొదట్లో అన్నీ తయారుచేయించి అప్పుడు... శ్రాద్ధ కర్మలో ఏమేమి జరుగుతుందో, నువ్వు బయట ఉండి చూస్తావు గానిగా...

వేణి :-కాని నేను విన్నదేమంటే...

గోవింద:-అరే...ఇలాంటి మాటలు ఎన్నయినా వినాల్సివస్తుందినాయనా... వెధవలు ఎంతోమందివచ్చి ఎన్నెన్నో చెప్తూతారు... కాని గోవింద బాబాయని నువ్వు పూర్తిగా ఎరుగుదువుగా...అంతేచాలు...

(ఇద్దరి నిష్క్రమణ)

## — రెండవ దృశ్యం —

(రమేశ్ యింటి ముందుభాగం. చండీమండపంలో కూర్చుని గోవింద గంగూలీ హుక్కా పీలుస్తూంటాడు. నాలుగువైపులా శ్రాద్ధకర్మకు ఏర్పాటులు జరుగుతూంటాయి. దానికి సంబంధించిన సామగ్రి చిందరవందరగా వుంటుంది. ఎంతోమంది మనుష్యులు వివిధములైన పనులు చేస్తూంటారు. సమయం మూడవజాము)

(రమేశ్ ప్రవేశిస్తాడు)

రమేశ్ :-(గోవింద గంగూలితో వినయపూర్వకంగా) రండి... మీరు వస్తారనే అనుకుంటున్నా...

గోవింద :-నాయనా... ఎందుకు రాను? ఇది నా స్వంతపని రమేశ్... (నేపథ్యంలో దగ్గు వినబడుతుంది. దగ్గుతూ ధర్మదాస్ చటర్జీ ప్రవేశిస్తాడు. భుజంమీద మాసిన దుప్పటి ఉంటుంది. ముక్కుమీద ఒక జత వంకాయలలాగా, పెద్ద కళ్ళజోడు వెనక్కి దారంతో కట్టబడి ఉంటుంది. తెల్లటి మీసపు వెంట్రుకలు. పొగాకు రంగుబారి ఉంటాయి. ముందుకు వచ్చి రమేశ్ మొగంవైపు కొంచెంసేపుచూచి ఏమీ మాట్లాడకుండానే ఒక్కసరిగా ఏడుస్తాడు. ఎవరో రమేశ్

గుర్తుపట్టనేలేకపోతాడు. ఏమైతేనేం, కంగారుగా ఆయన చెయ్యి పట్టుకుంటాడు. తనచెయ్యి పట్టుకోవటంతోనే...)

ధర్మదాసు :-(ఏడుస్తూ) కాదు నాయనా... రమేశ్... ఈ విధంగా తారిణీ మమ్మల్నందర్నీ దగాచేసిపోతాడని ఎన్నడూ స్వప్నంలో కూడా అనుకోలేదు. భయంతో నోటివెంట అబద్ధపుమాట రావటానికి, నేనేం చటర్జీవంశంలో పుట్టలేదు. నీకు తెలుసునా, నాయనా ...ఇక్కడికి వచ్చేముందు, రోడ్డుమీద నీ సయానా పెత్తండ్రి కొడుకు వేణీ మొగంమీద ఏమన్నానో ? "శ్రాద్ధకర్మ చేయటానికి రమేశ్ చేసే సన్నాహంచూస్తే అలా చెయ్యటమే ఒక గొప్ప విషయం... ఈ విధంగా యింత గొప్పగా జరిగే శ్రాద్ధకర్మను ఎవరూ కళ్ళతో చూసి ఎరుగరు", అని వచ్చాను...నాయనా నన్ను గురించి ఏ వెధవలవనీ, ఎన్నెన్నో చెపుతారు...... కాని ఒక్క విషయం మాత్రం జ్ఞాపకం ఉంచుకో... ఈ ధర్మదాసు, ధర్మానికి దాసుడుగాని, మరింకెవ్వరికీ కాదు.

(ఈ మాటలు అని, గోవింద గంగూలీ చేతిలో హుక్కా తీసుకుని ఒక గుక్కలాగి దగ్గటం మొదలుపెడతాడు)

రమేశ్ :-ఆహా...ఎంతమాట... మీరు యిలా అనటం...

(జవాబుగా ధర్మదాసు గొణగొణ ఏదో అంటాడు. కాని దగ్గువల్ల ఒక్కమాటకూడా ఎవరికీ అర్థంకాదు. అందరికంటె ముందుగా గోవింద గంగూలీ యీ యింటికి వచ్చాడు. అందువల్ల కొత్త జమీందారుకు మంచిమంచి మాటలుచెప్పే అవకాశం అతనికే లభించవలసి ఉంది. కాని అది నాశనం అయిపోతుందనే సూచన కలిగేసరికి ఒక్కసారిగా లేచి నిలబడతాడు)

గోవింద :-ధర్మదాస్ అన్నయ్యా... నిన్న ప్రొద్దున్న యిక్కడికి వద్దామని యింటినుంచి బయలుదేరికూడా, సరిగా రాలేకపోయాను. గోవింద బాబాయ్ హుక్కా త్రాగి పోదువుగాని రమ్మని వేణీ పిలవటం ప్రారంభించాడు. హుక్కా త్రాగినంతమాత్రాన ఏంపోయిందిలే అని మొదట్లో అనుకున్నా. తర్వాత వేణీ ఉద్దేశ్యం ఎలా ఉందో తెలుసుకుందామని బుద్ధిపుట్టింది. నాయనా...రమేశ్... వేణీ ఏమన్నాడో తెలుసా...... "బాబాయ్...... మీరంతా రమేశ్ మంచి

కోరేవాళ్ళుగా తయారయారే... పోనీ యిదిచెప్పు... వాడి యింటికి వీళ్ళంతా సామాన్యంగా సులభంగా వెళ్ళగల్గుతారా?" అన్నాడు. నేను మాత్రం వాణ్ణి ఊరికే వదలిపెట్టానా ... "అరే నువ్వు భాగ్యవంతుడివైతే అవవచ్చు... మా రమేశ్‌కూడా యెవ్వరికీ తీసి పోడు. నీయింట్లోనుంచి పిడికెడు దొరికే ఆశ యెవళ్ళకీలేదు." ఇంకా ఏమన్నానో తెలుసా... "వేణీబాబూ... దారియిదేగా... ఇక్కడే నిలబడి చూస్తూండు... బిచ్చగాళ్ళకు యేవిధంగా దానం దొరుకు తుందో... రమేశ్ నిన్న మొన్నటి కుర్రవాడయితే అవవచ్చు... కాని ధైర్యంఅంటే అతనిదే చెప్పాలి."... కాని ధర్మదాస్ అన్నయ్యా మనం మాత్రం చేయగల్గిందేముంది? ఇది ఎవరిపనో ఆయన ఆ లోకం లోనుంచి మనచేత చేయిస్తున్నాడు. నిజానికి తారిణీఅన్నయ్య శాపం తగిలిన దిక్పాలకుడు...

(ధర్మదాస్ దగ్గు యేవిధంగాకూడా తగ్గదు. ఈపసి జమీందార్ పిల్లవాడితో, తనుండగానే, గోవింద్ గంగూలీ యింత యిచ్చకంగా మాట్లాడుతున్నాడే అని చూస్తూంటాడు. అందుకని తను అంతకంటే ఎక్కువ యిష్టమైన మాటలు మాట్లాడాలని తడబడుతుంటాడు.)

గోవింద :-కాని... నాయనా .. నువ్వేమీ నాకు పరాయివాడవు కావు, ఆత్మీయుడివి. మీ అమ్మ నా మేనత్త కూతురికి సయానా చెల్లెలి కూతురు. రాధానగరపు బెనర్జీవంశపు పిల్ల. ఇదంతా తారిణీకి తెలుసు. అందుకని ఎప్పుడైనాసరే..యేంపని వచ్చినాసరే... యేవ్యాజ్యంలో సాక్ష్యం యివ్వాల్సి వచ్చినా...బస్ ...ఇంకేముంది... పిలు గోవిం దుడ్ని అనేవాడు.

ధర్మ :-అరే...గోవింద్...ఎందుకురా ఊరికే వాగుతావ్...అఖ్...ఖ్...ఖ్ నేనేం యీనాటి మనిషినికాను. నాకు తెలియదనుకున్నావా? ఆ సంవత్సరం ఆయన సాక్ష్యం యివ్వటానికని పిలిస్తే యేమన్నావ్?... 'నాకు చెప్పులు లేవు... వట్టి కాళ్ళతో యెలారాను?' ఖ్...ఖ్... అప్పుడు తారిణీ నీకు రూపాయిన్నర పెట్టి చెప్పులు కొనివ్వాలా... నువ్వు ఆ చెప్పులు తొడుక్కొని వెళ్ళే... వేణీ తరఫున సాక్ష్యం యిచ్చి వచ్చావ్...ఖ్ ...అఖ్

గోవింద :-(కళ్ళు ఎర్రగా చేసి చూస్తూ) నేను సాక్ష్యం యిచ్చి వచ్చానా?

ధర్మ :-ఇచ్చి రాలేదూ...?

గోవింద :-పోరా... అబద్ధాలకోరా...

ధర్మ :-అబద్ధాలకోరా... నీబాబే అబద్ధాలకోరు.

గోవింద :-(విరిగిన గొడుగు పుచ్చుకుని పైకి ఎగురుతాడు) అరే...వెధవా...

ధర్మ :-(వెదురుకర్ర నేలకేసి గట్టిగా కొట్టి) ఈ వెధవను నేను... అభ్... భ్... చుట్టరికంలో పెద్దన్నయ్యని అవుతాను కాదూ ...అంటుకని... ఈ వెధవ బుద్ధి చూడండి... (తిరిగి దగ్గుతాడు)...

గోవింద :-ఉ...ఈ వెధవ నాకు పెద్దన్నయట... (నాలుగు వైపులనుంచీ జనం పరుగెత్తుకు వస్తారు. ఆశ్చర్యపోయి చూస్తూంటారు. రమేశ్ తొందరగా వచ్చి వాళ్ళిద్దరి మధ్యా నిలబడతాడు.)

రమేశ్ :-అ ...అ ...ఇదేమిటి ? ఇద్దరూ పెద్దలు ... బ్రాహ్మణులు ... బాగుంది... ఇదేం పోట్లాట ?...

భైరవ :-(దగ్గరకువచ్చి రమేశ్‌తో...) సుమారు నాలుగువందల పంచలవరకు సిద్ధమయ్యాయి...ఇంకా ఏమన్నా కావలసిఉంటాయా...

(రమేశ్ జవాబేమీ యివ్వడు)

భైరవ :-ఛీ... గంగూలీజీ... మీ పోట్లాటచూసి బాబుగారు నిశ్చేష్టులై పోయారు. బాబూ మీరు యీ విషయం అంతగా పట్టించుకోకండి. సామాన్యంగా యిలా జరుగుతూనే ఉంటుంది. ఎవరి యింట్లోనైనా ఏదైనా పెద్దకార్యం జరిగినప్పుడు, కొట్లాట, ఖూనీలవరకువస్తుంది... తర్వాత దానంతటు అదే సర్దుకుపోతుంది. చటర్జీగారూ... ముందు యిది చెప్పండి...ఇంకా ధోవతులు చించాలా ?...

గోవింద :-అవును. యిలాగే జరుగుతూంటుంది. ఇంతకంటె ఎక్కువే జరుగు తుందికూడా... కాకపోతే దీనిని బృహత్కర్మని ఎందుకంటారు ? ఆ సంవత్సరం...నీకు జ్ఞాపకంఉందా భైరవ్...యదుముఖర్జీకూతురు రమ అభిషేక మహోత్సవపు రోజున మామూలు మాటమీదనే రాఘువభట్టాచార్యుడు, హారాన్‌చటర్జీ, తలలు పగులగొట్టుకోవటానికి సిద్ధమయ్యారు. కాని భైరవ్...రమేశ్‌చేసే యీ పని నాకేమీ నచ్చలేదు... ... తక్కువ జాతివాళ్ళకి యీ విధంగా బట్టలు పంచి

పెట్టటం...బూడిదలో పన్నీరు జల్లినట్టే...దీనికి బదులు బ్రాహ్మణులకి ఒక్కొక్క పంచయిస్తే కీర్తికలుగుతుంది. నేనుచెప్తున్నా గా... నువ్వు యీ పద్ధతి చెయ్యి... ఏం ధర్మదాస్ అన్నయ్యా... నీ అభిప్రాయం ఏముటి ?

ధర్మ :-(రమేశ్‌తో) నాయనా ... గోవిందుడేం చెడుసలహా చెప్పలేదు. వీళ్ళకు యివ్వటం వట్టిదండుగ...కాకపోతే శాస్త్రాల్లో వీళ్ళని నీచులని ఎందుకన్నారు ? ఏం నాయనా... రమేశ్... తెలిసిందా ?

రమే :-ఆ... తెలియకేం...

భైరవ :-ఐతే యీ బట్టలే సరిపోతాయన్న మాట...

రమే :-నేను సరిపోవనే అనుకుంటున్నా...ఇంకా ఎంతమంది బిచ్చగాళ్ళు వస్తారో...ఇప్పుడేమీ చెప్పలేను. అందుకని యింకా రెండువందల ధోవతులవరకు ఏర్పాటు చెయ్యండి.

గోవింద :-కాకపోతే...మరి పనిఎలా జరుగుతుంది... ఒక్కడివీ ఎంతదాకా తానులు చింపగలవ్...పద నేనూ వస్తాను...

(ఈ మాటలని గోవింద లోపలికి వెళ్ళబోతాడు... కాని ఒక ప్రక్క నిలబడిపోతాడు. ఇదే అవకాశంగా ధర్మదాసు రమేశ్‌ని ఒక మూలకు లాగుకువెళ్ళి చెవిలో మెల్లిగా ఏదో చెప్తుంటాడు. గోవింద ఓర కంటితో వీళ్ళవైపు చూస్తూంటాడు)

ధర్మ :-నాయనా...ఇది వట్టి చెడుదేశం...సామానుల కొట్టు ఒకరి చేతికి వప్పగించి నిశ్చింతగా కూర్చోవటానికి వీలులేదు. నూనె, నెయ్యి, ఉప్పు, పిండి...సగానికి సగం హరించుకు పోతాయి... నేను వెళ్ళి నీ మేనత్తను, పంపుతాను...ఒక పిసరుకూడా పోనివ్వదు.

రమే :-తమ ఆజ్ఞ...

(గడ్డం మీసం గొరికించుకుని, సన్నగా బలహీనంగా ఉండే ముసలి దీనానాథ్ భట్టాచార్యులు, ప్రవేశిస్తాడు.)

దీనానాథ్ :-ఓ...బాబూజీ ఎక్కడ ?

గోవింద్ :-(లేచినిలబడి) రా...దీను అన్నయ్యా...కూర్చో...ఇవ్వాళే తమ

పాదధూళి యిక్కడ పడటం, మా అదృష్టం...పాపం కుర్రవాడు ఒక్కడూ సతమత మవుతున్నాడు. ఐతే మీ రెవ్వరూ...

(ధర్మదాసు కళ్ళతో బెదరిస్తూ అతనివైపు చూస్తూంటాడు)

గోవింద :-ఐతే మీ రెవ్వరు యిటు ప్రక్కకు రానేరారా ?

దీనా :-నేను యిక్కడ లేనేలేను... నీ కోడల్ని తీసుకు రావటానికి దాని పుట్టింటికి వెళ్లాను. రమేశ్ ఎక్కడున్నాడు? పెద్దగా సన్నాహం జరుగుతోందని విన్నాను. దారిలో వస్తూంటే ఆ వూరి బజారులో చెప్పుకుంటున్నారు...కడుపునిండా తిండిపెట్టినతర్వాత ముసలి ముతక అందరికీ, పూరీలు, రవ్వలడ్డూలు పంచి పెడతారటగా...

గోవింద :-(కంఠస్వరం కొంచెంతగ్గించి) ఆ...ఇదేకాదు...తర్వాత బహుశా ఒకొక్కరికి ఒకొక్క ధోవతీకూడా దానం చేయబడుతుంది. దీనూ అన్నయ్యా ఇతనే మన రమేశుడు. మీ వంటి నలుగురు పెద్ద మనుష్యుల ఆశీర్వాద బలంవల్ల, ఏదోవిధంగా, నేను అంతా ఏర్పాటు చేసిఉంచాను. కాని ఆ వేణీ కాళ్లూచేతులు కడుక్కొని తనకేం సంబంధం లేనట్టుగా కూర్చున్నాడు. పైగా నా వెంటకూడా పడ్డాడు. అరే! నా దగ్గరకు రెండుసార్లు కబురుకూడా పంపించాడు. పోనీ, నా విషయం వదిలెయ్యి...ఎందుకంటే రమేశ్‌కూ నాకూ రక్తసంబంధం ఉంది...కాని యీ దీనానాథ్, ధర్మదాస్, నిన్ను వదిలివేస్తారా ? దీనూ, దారిలో కబురు తెలియటంతోనే, పరుగెత్తుకుని వచ్చేశాడు. అరేయ్...ఓ...షష్ఠిచరణ్! హుక్కా తీసుకురా... రమేశ్ యిలారాబాబూ...నీతో ఒకమాట చెప్పాలి...

(నౌకరు దీనానాథ్‌కు హుక్కా యిచ్చి వెడతాడు. గోవింద గంగూలీ రమేశ్‌ను ఒకప్రక్కకు లాగుకువెళ్ళి నెమ్మదిగా చెప్పటం ప్రారంభిస్తాడు)

గోవింద :-బహుశా...ఇంటిలోపలికి ధర్మదాస్ పెళ్ళాం వస్తుందనుకుంటా కాని జాగ్రత...చాలా మెలకువగా ఉండాలి. ఆ బ్రాహ్మడు ఎన్ని మాయమాటలు చెప్పనీ, సామాను కొట్టుగది తాళంచేతులు మాత్రం ఆవిడచేతికి యివ్వకు...సగానికి సగం మాయంచేసేస్తుంది. అసలు నీకు యింత తొందర ఎందుకు నాయనా ? నేనుయిప్పుడే వెళ్లి

దాన్ని పంపిస్తాను. స్వంతయిల్లులాగా భావించి అది సామగ్రి జాగ్రత్త పరచినట్టుగా, ఇంకెవళ్లు చెయ్యగలరు ? అసలు ఎవరైనా చెయ్య గలరా అని ?

దీనా :-(ఒకసారి రమేశ్ వంక, మరొకసారి గోవింద్ వైపు చూసి) ఏంత వంటలు ఎవరు తయారుచేస్తున్నారు నాయనా ? కలకత్తా పనివాళ్లని విన్నాను.

రమే :- (ముందుకువచ్చి) అవును... ఆచార్యులుగారూ... కలకత్తా పని వాళ్లే...(లోపలున్న వంటవాడితో) ఏయ్...నీ పేరేమిటి ? వెళ్లి... లడ్డూలు ఒక పళ్ళెంతో తీసుకురా...ఆచార్యులుగారూ! ఆలస్యం చెయ్యకండి...

భైరవ ఆచార్యులు ఇంటిలోపలికి వెళ్లిపోతాడు. కొంచంసేపట్లో వంటమనిషి లడ్డూలపళ్లెం తీసుకువస్తాడు)

దీనా :-ఆ...సరే...ఒక లడ్డూ గోవింద్‌కు యివ్వు... తినిచూచి మీరు కల కత్తాలో ఎలాంటి పనిమనుష్యులో చెప్పుతాడు.

వంటమనిషి లడ్డూలు, గోవింద్ దీనానాథ్‌లకు యిద్దరికీ యివ్వ బోతాడు)

దీనా :-అరరే!...నా కెందుకు? సరేలే...సగంఇయ్యి...సగంకం టెఎక్కువ వద్దు. (హుక్కా క్రిందపెట్టి) అరే...ఓ షష్టీచరణ్!...కాసిని నీళ్లు తీసుకురా...చేతులు కడుక్కుంటాను.

రమే :- (లోపలికి తొంగిచూసి) షష్టీ!...నాలుగైదు చిన్న పళ్లాలుకూడా తీసుకురా...

గోవింద్ :-లడ్డూలు చూడటంతోనే బాగా తయారయినట్టుగా కనపడు తున్నాయ్...పాకం కొంచెం పలచగా పట్టినట్టున్నావ్...

వంటమనిషి :-ఆ...ఈ వాయకు పాకం కొంచెం పలచగానే పట్టాను.

గోవింద్ :-(నవ్వి) అరే...మాకు తెలియదనుకుంటున్నావా... కళ్ళతోచూస్తే చాలు ఏ వస్తువు ఎలా తయారయిందీ చెప్పెయ్యగలం...

వంటమనిషి :-అవును బాబూ...తమకికాకపోతే, యింకెవరికి తెలుస్తుంది.

(షష్టిచరణుడు, వాడివెనుక యింకొక నౌకరు పళ్లాలు, మంచి నీళ్లు తీసుకువచ్చి పెడతారు వంటమనిషి పళ్ళెంతో లడ్డూలు తీసుకు వచ్చి బ్రాహ్మణులకు వడ్డిస్తూంటాడు. అంతా నిశ్శబ్దంగాఉంటుంది. ఎవరినోటినుంచీ ఒక్కమాటకూడా వెలువడదు. దీనానాథ్, ధర్మదాస్, గోవింద్ అంతా మ్రింగివేస్తూంటారు. చూస్తూండగానే పెద్ద పళ్ళెం ఖాళీఅయిపోతుంది.

దీనా :-ఆ...ఇది కలకత్తా పనివాడితనం...సందేహమేలేదు. ఏం ధర్మదాస్ అన్నా...ఏమంటావ్ ?

(ధర్మదాస్ జవాబు నోట్లోఉన్న లడ్డూలను పెకలించుకొని బయటకు రాదు. కాని దీనానాద్‌తో ఏకీభవించి నట్లుగానే తల ఊపుతాడు)

గోవింద :-(తెప్పరిల్లుకొని) అ...ఇది నిజంగా గొప్పవాళ్ళ చేతిపనే.

వంటమనిషి :-బాబూ మీరు శ్రమపడనే పడ్డారు. బూందీ లడ్డూలుకూడా పరీక్షచేసి చూడండి.

దీనా :-బూందిలడ్డూలా...ఎక్కడున్నాయ్ ? తీసుకురా... చూద్దాం...

(క్షణంలో వంటమనిషి బూందిలడ్డూల పళ్లెంతెచ్చి లడ్డూలు వి స్తర్ళ్ళలో వడ్డిస్తాడు. అవికూడా ఆఖరవటానికి ఎంతో సేపు పట్టదు)

దీనా :-(వంటవాడితో)...ఆ...దీనినే నాయనా విందులంటారు. అక్షరాలా అమృతం...బాగా తయారయాయ్... (రమేశ్‌తో) ఏం బాబూ రెండురకాల మిఠాయిలే తయారు చేయించావా ?

వంటమనిషి :-ఆ...కాదు...రసగుల్లాలు, క్షీరాన్నం...

దీనా :-ఆహా...క్షీరాన్నంకూడానా...అరే ఎక్కడుంది ? నువ్వు తీసుకునే రాలేదు. (ఆశ్చర్యంతో రమేశువంకచూసి) ఆ...ఒక్కసారి తిన్నా, రాధానగరం బోస్‌గారి యింట్లో, ఇప్పటికీ నిన్న మొన్న తిన్నట్టుగా ఉంది. నాయనా నేను చెపితే నమ్మవుగాని... క్షీరాన్నం అంటే నా కెంత యిష్టమని...

రమే :-(నవ్వి) అబ్బే...ఇందులో నమ్మకపోవటానికి ఏముందని ?

అరేయ్...ఓ షష్ఠి...చూడు. లోపల వంటాయన ఉంటాడు... కొద్దిగా క్షీరాన్నం తీసుకురమ్మని చెప్పు...

(షష్ఠీచరణుడి నిష్క్రమణ)

గోవింద :-(కొంచెం ఉద్విగ్న స్వరంతో) ఆ...ఇదేమిటి ? మిఠాయి అంతా యివతల యిలా పడుందే? అబ్బే...యిదేం బాగాలేదు...

ధర్మ :- తాళంచేతులు... తాళంచేతులు... సామాను కొట్టు తాళంచెవులు ఎవరిదగ్గరున్నాయ్...

గోవింద :-అరే...ఆ భైరవ ఆచార్యులదగ్గర లేవుగదా ?

(షష్ఠీచరణుడి ప్రవేశం)

షష్ఠి :-బాబుగారూ...ఇప్పుడు సామానులకొట్టుతియ్యటానికి వీలుపడదు... క్షీరాన్నం యివతలికి రాదు...

రమే :-అరే...వెళ్ళి చెప్పరా...నేను తెమ్మన్నానని...

గోవింద :-ధర్మదాస్ చూసావా...యీ ఆచార్యులపని...తల్లికంటె, బాధ, పినతల్లికి ఎక్కువైంది...అందుకనే నేను అనేది...

షష్ఠి :-ఇందులో ఆచార్యులుగారి తప్పేముంది ? ఆ యింట్నుంచి అమ్మగారు వచ్చి సామానుకొట్టు తాళంవేసేసారు. ఇది ఆ అమ్మగారి ఆర్డరు...

ధర్మదాస్ } గోవింద } ఎవరొచ్చారు ? వేణీబాబు తల్లి ? ఆ యింటి యజమానురాలా?

రమేశ్ :-పెద్దమ్మ వచ్చిందా ?

షష్ఠి :-అవును బాబూ...అమ్మగారు రావటంతోనే సామానుల గదులు పెద్ద దానికీ, చిన్నదానికీ రెండింటికీ తాళాలువేసారు. తాళంచేతులు వారి కొంగునే వున్నాయ్...

గోవింద :-ఏం జరుగుతుందో చూశావా ధర్మదాస్ అన్నయ్యా ? అసలు దీని అర్థం ఏమిటో తెలిసిందా ?

దీనా :-అరే...బాబూ...దీని అర్థం తెలుసుకోవటం ఏమంత కష్టం ? తాళం వేసి వెళ్ళిపోయింది. అంటే దీని అర్థం...సామానులకొట్టు యింకెవరి చేతిక్రిందా ఉండదన్నమాట. ఆవిడకి అంతా తెలుసు...

గోవింద :-నీకు తెలియనప్పుడు ఎందుకంత మాట్లాడటం ? ఈ విషయాలన్నీ ఏం తెలుసునని ఒక్కసారిగా చెప్పేస్తున్నావ్...

దీనా :-అరే ఇందులో తెలుసుకోవడానికి ఏముందని? యజమానురాలు స్వయంగావచ్చి తాళంవేసిందని విన్నావుగా... దీనికి ఎవరేమన గలరు...

గోవింద :-భట్టాచార్యులుగారూ... ఇక యింటికి వెళ్ళచ్చు... దేనికోసం ఇంట్లిల్లపాదీ పరుగెత్తుకు వచ్చారో అది పూర్తయిందిగా... తిన్నంత తిన్నారు...మూటకట్టినంత కట్టారు...మాకు యింకా బోలెడు పను లున్నాయి...

రమేశ్ :-గంగూలీజీ...మీకేమన్నా మతిపోయిందా? ఊరికే అపోహపడి ఒకళ్ళని అవమానిస్తారు దేనికి?

(మందలింపుతో, గోవింద సిగ్గుపడతాడు...తిరిగి జీర్ణపునవ్వు నవ్వి)

గోవింద :-అరే!...నేనెవర్ని అవమానించాను? సరే...నేనుఅనేది నిజమో కాదో, వారినేఅడుగు .. ఆయనచూడు ధర్మదాస్... యీ దీనూ బ్రాహ్మడి సంతోషంచూడు సరేలే?...

రమేశ్ :- 'సరేలే' ఏమిటి?

దీనా :-(రమేశ్‌తో) కాదు నాయనా... గోవింద నిజమే చెపుతున్నాడు నేను గర్భదరిద్రుడనని అందరికీ తెలుసు. నా దగ్గర వీళ్ళందరిలాగ ఆస్తిపాస్తి, భూమీపుట్రా ఏమీలేవు. ఇక్కడాఅక్కడా అడుక్కుని ఏదోవిధంగా కాలం గడుపుతున్నా:.. పిల్లలికి మంచి మంచి తిను బండారాలు పెట్టగలిగేశక్తి భగవంతుడు నాకు యివ్వలేదు. అందు కనే ఏ భాగ్యవంతుల యిళ్ళల్లోనైనా యిలాంటి కార్యాలు జరిగి నప్పుడు అక్కడ తిని తృప్తిపడుతూంటారు. నాయనా నువ్వేం అనుకోబోకు...తారిణీ బ్రతకుండగా, మాకు కడుపునిండా తిండి పెట్టేవాడు.

(అంతాచూస్తూండగానే దీనానాథ్ కళ్ళనుంచి రెండు నీటి బిందు వులు జారి క్రిందపడతాయి...దీనానాథ్ తల నూసి, చిరిగిపోయిన బట్టతో కళ్ళు తుడుచుకుంటాడు)

గోవింద :-ఆహా...ఏం ఉపన్యాసం...తారిణీ నీకు ఊరికే తిండిపెట్టేవాడా? ధర్మదాస్ అన్నయ్యా, వింటున్నావా...మాటలు...

దీనా :-ఒరేయ్...గోవింద్... నేనేమంటున్నానూ?

నాలాంటి దరిద్రులు తారిణీ యింటినుంచి, ఎప్పుడూ వట్టిచేతులతో తిరిగి వెళ్ళలేదనే అంటున్నాను.

రమేశ్ :-భట్టాచార్యులబాబూ...రెండురోజులు నామీద దయఉంచండి... క్షేంవీ తల్లిపాదధూళి యీ యింట్లోపడితే నా అదృష్టం అని అనుకుంటానుకూడా...

దీనా :-నాయనా రమేశ్...నేను బీదవాడ్ని, దీనుడ్ని నువ్వు యిలా అంటే నేను సిగ్గుతో చావాల్సిందే...

(నౌకరు ప్రవేశం)

నౌకరు :-బాబూ, అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు.

రమేశ్ :-వస్తున్నా...

దీనా :-సరే...నాయనా...మేము వెడతాం.

రమేశ్ :-మంచిదిబాబూ...కాని నా ప్రార్థనమాత్రం మరచిపోకండి.

దీనా :-ఎంతమాట...ప్రార్థన అంటావేం నాయనా ..ఇదంతా నీ దయ.

(దీనానాథ్ నిష్క్రమణ)

గోవింద :-రమేశ్...నేనుకూడావెడతాను. సంధ్యాపూజ...దేవుడినివేడను...

రమేశ్ :-కాని గోవిందబాబూ...

గోవింద :-అదేమిటినాయనా... నువ్వుచెప్పాలా... ఇది మా స్వంతపని... నువ్వు పిలవకపోయినా, మా అంతటమేము చేయవలసిన బాధ్యత మామీద ఉంది. రేపుపొద్దున్నే మీ అత్తయ్యని యిక్కడకు పంపించి, యిక నేను నిశ్చింతంగా గుండెలమీద చెయ్యివేసుకుంటా...

ధర్మదాస్ :- గోవింద్... నువ్వు అనవసరపువాగుడు ఎక్కువగా వాగుతుంటావ్...

గోవింద :- ఏం భయపడాల్సిన అవసరంలేదు రమేశ్... సామానులకొట్టు, అంతా...

ధర్మ :-బాగుంది...సామానులకొట్టు ధ్యాసపట్టుకుందెనీకు? దానివిషయం నేను ముందే ఏర్పాటుచేశేసాను.

గోవింద :- రమేశ్...ఇదంతా మేము చెయ్యాల్సినపని... నేను, ధర్మదాస్ అన్న, యిద్దరం నీ పిలుపుకోసం ఎదురుచూచామా? పిలవకుండానే వచ్చేశాము...వచ్చామా? లేదా?

ధర్మ :-ఇదిగో రమేశ్ ...నా మాటవిను...మేమేం వేణీఘోషాల్ లము కాము అసలు మా తత్వమే వేరు.

రమేశ్ :-అరే...మీ మాటలు మరీబాగున్నాయే...

(రమేశ్ పెత్తల్లి చాటుననిలబడి, మొగం కొంచెం యివతలకిపెట్టి అంటుంది)

పెద్దమ్మ :-రమేశ్ వీళ్ళుయిలా ఏమాట్లాడుతూంటారు. చదువుసంధ్యలూ లేవు. మంచి సాంగత్యం అంతకంటేలేదు...ఏమనేదికూడా వాళ్ళకే తెలియదు. (గోవింద, ధర్మదాస్ త్వరగా అక్కడినుంచి వెళ్ళిపోతారు)

రమేశ్ :-పెద్దమ్మా...

పెద్దమ్మ :-అవును నాయనా...నేనే...గుర్తుపట్టావా ?

(ఈ మాటలే అంటూ పెద్దమ్మ ముందుకువచ్చి నిలబడుతుంది. వయస్సు యాభైకు తక్కువుండదు. కాని చూడటానికి నలభైకంటె ఎక్కువవున్నట్టు కనబడదు. తలమీదిజుట్టు చిన్నదిగా, కత్తిరించబడి ఉంటుంది. కొన్ని వెంట్రుకలు నుదుటి మీదకుపడి ఉంటాయి. ఒక సమయంలో గొప్ప అందకత్తె అని పేరు ప్రఖ్యాతులు పొందింది. ఆ అందం యిప్పటికీ ఆమె శరీరాన్ని వదలిపోలేకపోయింది. ఆమె అవయవాలు, శిల్పిసుందరకృషి ఫలితమా అన్నట్టుగా తీర్చిదిద్దినట్లుగా ఉంటాయి)

రమేశ్ :-పెద్దమ్మా...ఎవరినైతే నువ్వు పెంచి పెద్దవాడినిచేసావో, వాడి విషయంలో నేయిలా అనుకుంటున్నావా ? పెద్దవాడై యింటికి తిరిగి వచ్చి, నిన్నే గుర్తుపట్టలేడా ?

పెద్దమ్మ :-లేదు...నాయనా...నాకాసందేహంలేదు. కాని పెద్దమ్మను నువ్వు మరచిపోలేదన్న విషయం, నీనోటివెంట వినకుండా ఉండలేకపోయాను నాయనా...

రమేశ్ :-అదికాదు పెద్దమ్మా... అంతా నాకు జ్ఞాపకమేఉంది. పూర్తిగా జ్ఞాపకంఉంది. కాని నేను చేసుకునేదేదో, స్వయంగానే చేసుకుందునుగా...నువ్వు శ్రమపడి యీయింటికికూడా వచ్చావ్.

పెద్దమ్మ :-నన్నేమీ నువ్వు స్వయంగాపిలిచి తీసుకురాలేదుగా నాయనా... దీనికి నేను సమాధానం యివ్వటానికి...

రమేశ్ :-పిలిచి ఎలా తీసుకువచ్చేది పెద్దమ్మా ? అన్నిటికంటె ముందు, అమ్మ వని నీ ఒడిలోకే పరుగెత్తుకు వచ్చాను. కాని పెద్దమ్మా...నువ్వు, ఇంటిలోలేవని, కలుసుకోటానికి వీలులేదని జవాబుచెప్పించావుగా...

పెద్దమ్మ :-అందుకనే నీకు కోపంవచ్చినట్లుంది రమేశ్ ' నన్ను యింట్లోనుంచి యీ కారణంవల్లే బయటకు పంపేయాలనుకుంటున్నావ్...

రమే :-నాకా కోపం? తల్లిలేదు...తండ్రిలేదు, స్వంత జన్మస్థలంలోకూడా నిరాశ్రయుడనై, పరదేశిలాగాఉన్నాను. ఏం తప్పులేకుండానే, నా వాళ్ళు, పరాయివాళ్ళుకూడా, నన్ను వేరుచేస్తున్నారు... పెద్దమ్మా యిలాంటచోట నా అలకకు ఏం విలువ ఉంటుంద నువ్వేచెప్పు?

పెద్దమ్మ :-ఏం...నాయనా రమేశ్...నా దగ్గరకూడా దానికేం విలువలేదా?

రమే :-లేదమ్మా...లేదు...ఇవ్వాళే నీకొడుకునే నువ్వు కొడుకనుకుంటున్నావ్...ఒకానొకరోజున తల్లిపోయిన కుర్రవాడని ఒకడ్ని కన్న కుమారునిలాగా పెంచావన్న విషయం మరచిపోయావ్...

పెద్దమ్మ :-ఏం... నాయనా... ఇలాగే నన్ను దెప్పిపొడుస్తావా? ఇంటా బయటాకూడా యీ విధంగా బాధపడటానికేనా, మిమ్మల్నిద్దరినీ, పెంచి పెద్దవాళ్ళను చేసాను?

రమే :-ఇంటా...బయటా... నాకు అర్థమయింది... (అకస్మాత్తుగా ఆమె ముందు మోకరిల్లి) పెద్దమ్మా నన్ను క్షమించు...ఉక్రోషంతో నిజం తెలుసుకోలేకపోయాను.

(పెద్దమ్మ రమేశ్‌ను లేవనెత్తి ఎడమచేతితో అతని చుబుకాన్ని స్పృశిస్తుంది)

పెద్దమ్మ :-నాయనా...నాకు తెలుసు...

రమే :-ఏమైనా...నువ్వు యీ యింటికి రాబోకు పెద్దమ్మా...ఏదైనా సహిస్తాను కాని నాకోసం నువ్వు దుఃఖపడటాన్ని మాత్రం సహించలేను.

పెద్దమ్మ :-ఇది సరికాదు రమేశ్... దుఃఖపడటమే కర్తవ్యమైతే, నువ్వూ సహిద్దువుగాని, నేనూ సహిస్తాను. కృత్రిమంగా విశ్రాంతి పొందాలనుకుంటే, విశ్రాంతిపోవటమే కాదు, ఎక్కువ దుఃఖంకూడా కలుగుతుంది. నన్ను ఆటంకపరచాలనుకోబోకు...ఒకవేళ బలవంతంచేసినా నేను దానికి ఎంతమాత్రం అంగీకరించనుకూడా...

రమే :-పెద్దమ్మా నిన్ను నేను మరచిపోయాను...అందుకనే నిన్ను ఒప్పించాలనే అపరాధంచేశాను. ఇక నా మాట వినొద్దు... నీకు మంచిదని తోచినట్లుగా చేయి...

పెద్దమ్మ :-ఆ...అదేచేస్తాను.

రమేశ్ :-అవును అలాగేచేయి... ఎన్నితుపానులు ఎన్నికష్టాలు నీకురాలేదు. మధ్య మధ్య వాటికబుర్లు నాకు తెలుస్తూనే ఉండేవి. కాని అవేమీ నిన్ను మార్చలేకపోయాయి. ఎన్నడూ ఆరిపోని తేజోవంతమైన అగ్ని నీలో ధగధగ వెలుగుతూనే ఉంది.

పెద్దమ్మ :-చాలు చాల్లే ఇకఊరుకో... చిన్న నోటివెంట పెద్దమాటలు మాట్లాడకు. సరే మీ పెద్దన్నయ్య దగ్గరికి వెళ్లావా లేదా ?

(రమేశు తలవంచుకుని మాట్లాడకుండా ఊరుకుంటాడు)

పెద్దమ్మ :-ఇంటిదగ్గర లేనట్టుగా చెప్పించి నిన్ను కలుసుకోలేదన్నమాట.

(రమేశ్ అలాగే మాట్లాడకుండా ఊరుకుంటాడు.)

పెద్దమ్మ :-కలుసుకోకపోతే, పోనీలే...ఐనా ఒకసారి మళ్ళీ...(కొంచెంసేపు ఊరుకుని) నువ్వంటే వాడికి గిట్టదని నాకు తెలుసు. ఐనా నీ పని నువ్వుచెయ్యాలి. వాడు పెద్దవాడు. వాడిఃముందు తలవొగ్గటం సిగ్గు చేటు కాదునాయనా. అదికాకుండా, పరాయివాళ్ళముందైనాసరే, చేతులు జోడించి అన్ని తగాదాలు మాపుకోవలసిన సమయం యిది. ఇదే మానవత్వం. నా రాజాబాబువి కాదూ...మళ్ళీఒకసారి వాడి దగ్గరకు వెళ్ళు...ఇప్పుడు బహుశా వాడు యింటిదగ్గరేఉంటాడు.

రమేశ్ :-పెద్దమ్మా...నీ ఆజ్ఞ ఐతే అలాగే వెడతాను.

పెద్దమ్మ :-నాయనా...ఒకసారి రమవద్దకుకూడా వెళ్ళిరా...

రమేశ్ :-వెళ్ళివచ్చా పెద్దమ్మా...

పెద్దమ్మ :-వెళ్ళావా ? నిన్ను గుర్తుపట్టిందా ?

రమే :-ఆ...గుర్తుపట్టిందనే అనుకుంటాను. లేకపోతే అవమానించి నన్ను యింట్లోంచి బయటకు ఎందుకు గెంటిస్తుంది ?

పెద్దమ్మ :-అవమానించి బయటకు గెంటించిందా ? రమేనా ?

రమే :-ఆ...అవమానించటంవల్ల తృప్తికలగలేదనుకుంటూ...అందుకనే ఎప్పుడైనా తిరిగివస్తే దర్వాన్ చేతకూడా గెంటిస్తానని చెప్పించింది.

పెద్దమ్మ :-స్వయంగా రమే అందా ? రమేశ్ యీ చెవులతో, విన్నాసరే యిది నమ్మలేను నాయనా...

రమే :-పెద్దమ్మా...అన్నయ్యకూడా అక్కడే ఉన్నాడు. ఆయన్నే అడగరాదూ...

పెద్దమ్మ :-వేణీకూడా ఉన్నాడన్నమాట... ఐతే జరిగుండవచ్చు (కొంచెం సేపు ఆగి) తిరిగి యింటికివస్తే దర్వాన్ చేతికొంటిస్తానని, రమ అన్నదని నువ్వు నిజమే చెప్పుతున్నావా రమేశ్ ? నాయనా నన్ను మోసగించబోకు...సరిగాచెప్పు...

రమే :-నిజమే పెద్దమ్మా...అంది... కాని స్వయంగా అనకుండా, యెవరో పినతల్లిట...ఆమెచేత అనిపించింది.

పెద్దమ్మ :-(నిట్టూర్చి) ఓహో... అలాచెప్పు... లేకపోతే రమేశ్... రాత్రి పగలు రెండూకూడా అసత్యాలయిపోతాయి. కత్తి పీకమీదపెట్టినా సరే...నీతో యింతపరుషంగా మాట్లాడలేదు. ఐతే యీ మాటలు దాని పినతల్లి అన్నదన్నమాట...అదికాదుగా...

రమే :-ఐతే రమదగ్గరకుకూడా వెళ్ళమనా పెద్దమ్మా నువ్వనటం? రమ నీకు పూర్తిగా తెలుసా...

పెద్దమ్మ :-ఆ...తెలుసు నాయనా...కాని యిప్పుడు నిన్ను వెళ్ళమని చెప్పను నీ తండ్రికీ వాళ్ళకీ చాలకాలంవరకు దావాలు జరిగాయి. ఒకవేళ అది నీకు శత్రువు అని అన్నా, అదేమీ అబద్ధం కాదు. ఐనప్పటికీ అలాంటి మాటలు రమ అనలేదని నాకు తెలుసు. కోటి మందిలో వెదకినా సరే, అలాంటిపిల్ల దొరకదు నాయనా...ఇంకా యీ ఊరిలోకొంచెం ధర్మం నిలిచిఉందీ అంటే దానివల్లనే నాయనా.

రమే :-అక్కడచూస్తే, సంగతి యిదని నాకు తెలిసిందికాదు...

పెద్దమ్మ :-వెంటనే తెలియదుకూడా... ఐతే రమేశ్, యిదే సరైనపద్ధతి. అక్కడికి వెళ్ళటానికి వీలుకానప్పుడు, ఆ ప్రశంస మానివేయుటమే మంచిది. కాని నాయనా... ఇంతవరకు యిక్కడఉండి, నేను రావటంతోనే పారిపోయారే... వాళ్ళని ఎన్నటికీ నమ్మకు...వాళ్ళ సంగతి నాకు పూర్తిగా తెలుసు...

రమే :-కాని పెద్దమ్మా...యీ కష్టసమయంలో, వాళ్ళేనన్ను ఆదుకున్నారు. వాళ్ళనే నమ్మకపోతే, యింకెవరిని నమ్మను ?

పెద్దమ్మ :-దీనికి జవాబు ఏంచెప్పనా అనే ఆలోచిస్తున్నా నాయనా... సరే...విందుకు పిలిచేవాళ్ళజాబితా తయారయిందా...

రమే :-లేదు...ఇంకా తయారుకాలేదు.

పెద్దమ్మ :- ఇదిగో రమేశ్... దానిని ముందూ వెనకా ఆలోచించి మరి తయారుచేయ్...ఈ ఊర్లో ... ఇక్కడే కాదు ఏ ఊరిలోనైనాసరే ...పరిస్థితి యిలాగే ఉంటుంది. ఒకడు ఒకడితో కూర్చుని భోజనం చెయ్యడు... ఇంకోడితో మాట్లాడడు, ఎవరియింట్లోనైనా ఏదైనా కార్యం వచ్చినపుడు యీ తగాదాలకు అంతేఉండదు. ఎవర్ని పిల వాలి ఎవర్ని మానెయ్యాలి అన్నది నిర్ణయించుకోవటమే కష్టం...

రమే :- కాని పెద్దమ్మా...ఇలా ఎందుకు జరుగుతూంటుంది ?

పెద్దమ్మ :- నాయనా...దీనికి బోలెడు కారణాలుంటాయి. ఒకవేళ నువ్వు యిక్కడే ఉంటే అన్నీ నీకే తెలుస్తాయి. ఎవడివల్లా ఏమీ తప్పుం డదు. నిజానికి వ్యక్తిఅపవాదులే... అవీకాకుండా దావాలు, తప్పుడు సాక్ష్యాలు, వీటివల్ల పార్టీలు ఏర్పడిపోయాయ్. రమేశ్ నేనే రెండురోజులుముందు వచ్చిఉంటే యింత సన్నాహం చేయించి ఉండేదానిని కాను. ఇంతకూ ఆ రోజున ఏం జరుగుతుందా అనే ఆలోచిస్తున్నా...

(పెద్దమ్మ యీ మాటలే అని దీర్ఘంగా నిట్టూరుస్తుంది)

రమే :- ఈ నిట్టూర్పుకు అర్థం తెలుసుకోవటంకష్టం పెద్దమ్మా...కాని నాకు దీనితో ఏమీ సంబంధంలేదు. నన్ను పరదేశి అనే అనుకోండి. నాకు ఎవరితోనూ విరోధంలేదు. నేను ఏ పార్టీలోను కలవనుకూడా... ఎవరికైనా సరే నా వల్ల అవమానం కలగదు. అందర్ని గౌరవ మర్యా దలతో ఆహ్వానిస్తాను.

పెద్దమ్మ :- అదే మంచిది. కాని ఏమైనా, నాయనా, అందరి అభిప్రాయం తెలుసుకుని యీ పని చెయ్యి. లేకపోతే పెద్ద గందరగోళం జరుగు తుంది. అమ్మా...భవానీ...

రమే :- ఐతే నువ్వు యిప్పుడే వెళ్ళిపోతావా పెద్దమ్మా...

పెద్దమ్మ :- లేదు నాయనా... వెళ్లను, ఇంకా ఒకటిరెండు పనులు మిగి లున్నాయ్... అవి పూర్తిచేసి వెడతాను. కాని రమేశ్ తాళం చేతులు నా దగ్గరే ఉంటాయ్...రేపు ప్రొద్దున్నే వచ్చి సామానుల గది తాళం నేనే తీస్తాను.

(నిష్క్రమణ)

(ధర్మదాస్, గోవింద్, పరాన్ ల ప్రవేశము)

గోవింద :-(రమేశ్ తో) రమేశ్... చూసావా, ఈ పరాన్ మామను ఏదో విధంగా పట్టితీసుకువచ్చాను. ఈయనకు రావాలనిఉందనుకున్నావా? కాని నేనైనా ఊరికే వదిలేవాడిననుకున్నావా? వేణీయేనా జమీందార్? నా మేనల్లుడు జమీందారు కాదనుకున్నావా అన్నాను. (పైకిచూసి) తారిణీ నువ్వు స్వర్గంలో కూర్చుని అంతా వింటూనే ఉన్నావ్. ఇదిగో నీ ఎదుటనే ప్రమాణం చేస్తున్నా... వేణీని యీ యింటిలోకే పిలిపించి ముక్కు పిండకపోతే నా పేరు గోవింద గంగూలీయే కాదు...

ధర్మదాసు :-అరే... గోవింద్ నువ్వు కొంచెం శాంతించు... (దగ్గుతూ) ఇదంతా నేను సరిచేస్తానులే...

(అకస్మాత్తుగా వేణీ ఘోషాల్ ప్రవేశం)

వేణీ :-రమేశ్...ఇక్కడే ఉన్నాడా? తొందరపనిమీద వచ్చాను. అమ్మ వచ్చిందా?

గోవింద :-రాకేం నాయనా...వందసార్లు వస్తుంది, అరే యిది నీ యిల్లు... అందుకనే నేను ప్రొద్దున్నుంచీ రమేశ్ తో యిదే చెప్తున్నా... రమేశ్... పోట్లాటలు అన్నీ తారిణీతోనే పోయాయి... అవన్నీ వదిలెయ్యి—ఆయన లేనేలేడు. ఇద్దరన్నదమ్ములు ఏకమవండి. మేము చూసి సంతోషిస్తాం అదీకాకుండా పెద్దమ్మగారు స్వయంగా యిక్కడికి వచ్చినతర్వాతకూడా...

వేణీ :-అమ్మ వచ్చిందా?

గోవింద :-కేవలం రావటమేకాదు...యింట్లోపనులు, సామానులకొట్టు అజమాయిషీ అన్నీ స్వయంగానే చూస్తున్నారు. ఇవన్నీ ఆమె చెయ్యకపోతే యింకెవరు చేస్తారు?

(అందరూ మాట్లాడకుండా ఊరుకుంటారు)

గోవింద :-(పెద్దగా నిట్టూర్చి ఈ ఊళ్ళో పెద్దమ్మగారిలాంటి మనిషి యింకెవరున్నారు? ఇకముందు ఉంటారా అని? ఊహు... నీ ఎదుట అంటే మెప్పుకన్నానని అనుకుంటారు. ఎవరేమనుకోనీ. ఊళ్ళో

లక్ష్మిఅంటూ ఉండిఉంటే, ఆవిడ మీ అమ్మేనని చెప్పుకోవాలి. ఇలాంటి తల్లి ఎవరికి దొరుకుతుంది ?

(ఈ మాటలే అని మళ్ళీ ఒకసారి నిట్టూర్పుతాడు)

వేణి :-సరే...

గోవింద :- సరే ఏమిటి వేణీబాబూ... నువ్వురావాలి... అంతా చేయాలి... భారంఅంతా నీ మీదనే ఉంది. సరే అందరూ యిక్కడే ఉన్నారుగా... ఎవరవర్ని పిలవాలో ఆ జాబితా తయారుచేసేస్తే మంచిది. ఏమంటావ్ రమేశ్ ? ఏం పరాన్... నేచెప్పింది బాగుందలా... ధర్మదాస్ యిప్పుడు ఊరుకుంటే ఎలాగ ? మీ కందరికీ తెలుసుగా ఎవర్ని పిలవాలో, ఎవర్ని మానాలో...

రమేశు :-పెదన్నయ్యా... తమ పాదధూళి కాస్తంతి యిక్కడ పడనిస్తే...

వేణి :-అమ్మ వచ్చిందిగా...ఇక నేను రావటం, రాకపోవటం...ఏం గోవింద బాబాయి ఏమంటావ్ ?

రమే :-పెద్దన్నయ్యా, తమర్ని నేనేం విసిగించను... కాని తమకు ఇబ్బంది కలగకపోతే, ఒకసారి వచ్చిమాసి వెళ్ళండి.

వేణి :-ఆ... ఇది బాగానే ఉంది. అమ్మ వచ్చినప్పుడు, నేను వచ్చినా, రాకపోయినా...ఏమంటావ్ పరాన్ మామా ? సరేగాని రమేశ్... అమ్మతో కాస్తంత తొందరగా రమ్మని చెప్పు. చాలాపనుంది. ఇక నేను ఆగటానికి వీలులేదు...ప్రజలంతా

(అంటూనే వేణీ తొందరగా వెళ్ళిపోతాడు)

గోవింద :-(తెరవైపు మెడచాచి, బాగా చూసినతర్వాత) అరే... వేణీ... నువ్వు ఆకులు లెక్కపెట్టేవాడివైతే, నేను కాడలు లెక్కపెట్టే రకాన్ని... నా పేరు గోవిందగంగూలీ... అమ్మ వచ్చిందో లేదో స్వయంగా, కళ్ళతో చూద్దామని వచ్చావా ? నాకేం తెలియదనుకున్నావా? (రమేశ్‌తో) చూసావా రమేశ్ నేనెంత తియ్యతియ్యగా అంటించానో ? అప్పం తేనెపూసినకత్తి... ఇప్పుడు మనమేమీ తనను ఆదరించలేదని అనటానికి వీలులేదు. లేకపోతే ఊళ్లో ఏమంటూ తిరిగేవాడో తెలుసా ? రమేశ్ కుర్రవాడంటే ఒప్పుకుంటాను... కాని వాడి మామ గోవింద్ అక్కడే ఉన్నాడుగదా అని అనేవాడు. పెద్దపెద్ద కార్యాల్లో పెత్తనంచెయ్యటం మాటలుకాదు నాయనా... ఒక్కొక్క ఆలోచనచేస్తే బుర్ర గిర్రున తిరిగిపోవాలి...

ధర్మదాస్ :-గోవింద్ అనవసరంగా వాగుతావ్... ఇక ఊరుకోరాదూ...

(ఒకవైపున యిద్దరు వ్యక్తులు లోపలికి వెళ్ళిన చప్పుడవుతుంది. పరాన్ తీక్షణంగా వాళ్ళవైపు చూస్తాడు. కొంచెంసేపట్లో నౌకరు షష్టిచరణ్ వస్తాడు.)

పరాన్ :-లోపలికి ఎవరురా వెళ్ళింది ?

షష్టీ :-అదే...శాంతమ్మ...ఆవిడకూతురు...

పరాన్ :-నేననుకున్నట్లే అయింది... అసలు వాళ్ళని యింట్లోకి ఎవరు రానిచ్చారు ?

షష్టీ :-ఆచార్యులుగారు పిలిపించారు. రెండురోజులనుంచీ ఆయనే అన్ని పనులూ చేస్తున్నారు.

పరాన్ :-వాళ్ళు కనుక భోజనపదార్థాలు ముట్టుకుంటే... ఏ బ్రాహ్మడు కూడా యిక్కడ పచ్చి మంచినీళ్లయినా త్రాగడు...తెలుసా...

గోవింద :-చూస్తున్నావుగా పరాన్ మామా... మనల్ని అవమానించి వాళ్ళని లోపలికి తీసుకుని వెళ్లాడు. భైరవుడి ధైర్యంచూడు...సరేలే...

పరాన్ :-రమేశ్ ముందు మామాటకు జవాబుచెప్పు... మా యిష్టంలేకుండా యీయిద్దరు ఆడవాళ్ళనీ లోపలికి ఎందుకు వెళ్ళనిచ్చావ్ ? లేకపోతే యీ యింట్లో మేము పచ్చి మంచినీళ్ళయినా సరే త్రాగం.

పెద్దమ్మ :-(తలుపుదగ్గరకువచ్చి) రమేశ్ ...

రమే :-పెద్దమ్మా...యిప్పటివరకు యిక్కడేఉన్నావా ?

పెద్దమ్మ :-ఆ...ఉన్నా...శాంత, సుకుమారీలను ఆదర పూర్వకంగా నేను పిలిపించాననీ, ఆచార్యులుగారు కాదనీ, గోవింద గంగూలీతో చెప్పు-వూరికే వాళ్ళను అవమానించాల్సిన అవసరం లేదు.

పరాన్ :-వాళ్ళని యిక్కడినుంచి వెళ్ళగొడితేనేగాని యీ యింట్లో ఎవ్వరూ నీళ్ళు ముట్టుకోరు.

పెద్దమ్మ :-ఆ విషయం ఎల్లుండి తేలుతుంది. నేను చెపుతున్నా...ఇవ్వాళ నా యింట్లో గల్లంతు పోట్లాటలు ఏవీ జరగటానికి వీలులేదు. నేను అందర్నీ పిలుస్తాను...ఏ ఒక్కర్నీ కూడా వదిలెయ్యను.

పరాన్ :-ఐతే మాలో ఎవ్వరం యిక్కడ పచ్చి మంచినీళ్ళయినాసరేత్రాగం.

పెద్దమ్మ :-రమేశ్... నన్నెవ్వరూ బెదిరించనక్కరలేదని వీళ్ళతో చెప్పు...

ఇక్కడ బీద బిక్కికి ఏం తక్కువలేదు. మా యీ సన్నాహం అంతా వృధా ఏంకాదు...పైగా సార్థకమవుతుందికూడా...

రమేశు :-(విచారంగా)... కాని వీళ్ళంతా కలిసి దీన్ని ముక్క ముక్కలు చేసేస్తాం అంటున్నారు పెద్దమ్మా. దీని జవాబుదారీ అంతా నీ మీద పడుతుందేమో...

పెద్దమ్మ :-రమేశ్...ఇదంతా నీ వెర్రితనం నాయనా... మన యింటి వ్యవహారాల జవాబుదారీ మన నెత్తిన కాకపోతే, పరాయివాళ్ళపైన పడుతుందా? ఇప్పటికి నీళ్ళని వెళ్ళిపొమ్మను. ఇంకా బోలెడు పనులున్నాయ్...నాకు వూరకే కాలం వెళ్ళబుచ్చటానికి తీరిక లేదు.

(పెద్దమ్మ లోపలికి వెళ్ళిపోతుంది వెంటనే గోవింద, ధర్మదాసు, పరాన్, నెమ్మదిగా బయటకు వెళ్ళిపోతారు)

రమేశు :-నాకు ఎవరూ లేరనుకున్నా.... కాని పెద్దమ్మా నువ్వు ఎవరిదాన వౌతావో, వాళ్ళకు సర్వం ఉన్నట్టే...

## — మూడవ దృశ్యం —

(శ్రాద్ధభోజనంచేసి దీనూ భట్టాచార్య తిరిగి వస్తూంటాడు, చేతిలో చిన్న పొట్లంఉంటుంది. రమేశ్ నౌకరు భజువా ఎదురుగా వస్తాడు.)

దీనా :-అరే—భజువా బాబేనా...ఎక్కడికిబాబూ వెడుతున్నావ్?

భజువా :-ఆచార్యజీ...ఏమిటి తీసుకుపోతున్నారు?

దీనా :- ఏమీలేదు నాయనా... కాస్తంత ఎంగిలిమితాయి... మా వీధిలో పాపం బీదవాళ్లు...చిన్నపిల్లలు ఉన్నారుకదూ... వెళ్ళటమే ఆలస్యం, అంతా చేతులుచాచుకుని, నిలబడతారు. వాళ్లకు కొంచెం యిద్దామని...

భజువా :-అరే...దానికేంలోటు...ఎంతమంది బిచ్చగాళ్ళు అక్కడ కూర్చుని తినటంలేదు?

దీనా :-అవునుబాబూ... అవును...తినకేం... అంతాతింటూనే ఉన్నారు. అక్కడ లోటు అంటూ ఏముంది? కాని మరి అందరూ అక్కడికి రాలేరుగా...వాళ్లకోసమని కొంచెం...

భజువా :-ఆ...మంచిదే...భట్టాచార్యులుగారు...ఇది వట్టి దరిద్రపుఊరు...

అబ్బబ్బ...ఎంతెంతగోల జరుగుతోందని...వీడు లేస్తే వాడు కూర్చుం టాడు. ఒకడు పారిపోతూంటే, ఇంకోడు వాడిని పట్టుకుని లాగు కుని వస్తాడు...హా...హా...హా...

దీనా :-అదే బాబూ... అంతటా ఇలాగే జరుగుతూంటుంది. పెద్ద పెద్ద కార్యాలలో ఇలా జరగటం మామూలు... మావూరే కా స్తంతివయాం ...భజువా...క్షేంవీమామయింట్లో జరిగిన సంగతి ఏం చెప్పను ? అక్కడ బ్రాహ్మణులు, కాయస్థుల యిళ్లు మొత్తం కలుపుకుని యిరవైకూడా ఉండవు. కాని పార్టీలు పదివరకు ఉన్నాయి... ఏమైనా ఒక్క విషయంమాత్రం చెప్పగలను బాబూ... భిక్షకోసం ఎన్నోచోట్లకు వెళ్లాల్సిఉంటుంది...ఎంతమందికో నేనంటే అపరి మితమైన దయకూడాను. నాకు తెలిసినంతమట్టుకు, దయ అన్నది ఉన్నదీ అంటే, మీ బాబుగారిలాంటి కుర్రవాళ్లలోనే... ముసలి వెధవలలో ఏముంది ? సమయం దొరకటం తడవు పీకమీద కాలువేసి త్రొక్కి నాలుక బయటికిరప్పించి మరీ వదలుతారు.

(ఈ మాటలే అని నాలుక బయటకుచాచి చూపించుతాడు)

భజువా :-హా...హా...హా...

దీనా :-ఇక ఈ గోవిందగంగూలీ ఈ వెధవచేసిన పాపాలు చెపితేనే చాలు ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. మోసం చెయ్యటం, అబద్ధసాక్ష్యాలు యివ్వటంలో, దొంగదావాలు బనాయించటంలో వీడికి ఎవ్వరూ సాటిరారు. అంతా వీడంటే జడుస్తారుకూడా... అదీకాకుండా వేణీ బాబు వీడికి మద్దతు. అందుకనే వాడిని ఏమనటానికి ఎవ్వరికీకూడా ధైర్యం ఉండదు. ఎవడ్ని ఏమిచేసినా అంతే...

భజువా :- ఆచార్యులుగారూ... అంతటా యిలానేఉంది. మా వూరులో కూడా ఎప్పుడూ పోట్లాటే... కాని ' మా బాబుగారిలాంటి మనిషి ఎక్కడా ఉండడు.

దీనా :-అదే...బాబూ...ఎక్కడా ఉండడనే నేనూ అంటున్నా...

భజువా :-మా బాబు...మనిషా...దేవుడుగాని...

దీనా :-అవును...నాయనా...రమేశ్ నిజంగా దేవుడే... సరేగాని భజువా బాబూ...ఎక్కడికి వెడుతున్నావ్ ?

భజువా :-ఆచార్యులుగారింటికి...

దీనా :-సరేలే...తొందరగా వెళ్ళు... నేనూ వెడతాను. (నిష్క్రమణ)

# 4

(మధుపాల్ దుకాణం...బేరం జరుగుతూంటుంది)

ఒకడు :-కానీ నూనె పోయటానికి సాయంకాలం వస్తేట్టుందే ?

మధు :-పోస్తానయ్యా...బాబూ...

రెండవవాడు :-ఓ...మధు అన్నాయ్... కానీ పసుపు యివ్వటానికి యింత సేపా ?

మధు :-అరే...ఇస్తున్నానోయి...నేను ఒక్కడ్ని...

మూడవవాడు :-అ...రెండుకానుల పప్పు నువ్వియిచ్చినట్లే... మా యింట్లో యిక వంటకూడా అయినట్టుగానే ఉంది...

మధు :-అరే...వంట ఎందుకవదోయ్ ? ఇదిగో తీసుకో...

(రమేశ్ ప్రవేశం)

మధు :-(మెడ ముందుకు చాచి చూచి) అరే... చినబాబుగారు... బాబూ నమస్కారం...

(ఎత్తైన కోయ్యపెట తీసుకుని, దుకాణంమీదనుంచి క్రిందకు దిగివస్తాడు)

మా ఏడుతరాలవాళ్ళ పుణ్యంబాబూ, ఇవ్వాళ మా దుకాణంమీద తమ పాదధూళి పడింది.

రమే :-లెక్కవేసి చూసుకుంటే నీకు పదిరూపాయలు ఇంకా బాకీఉన్నాను. తీసుకోటానికినువ్వురాలేదు. నేనూ పంపించలేకపోయాను స్వయంగా తీసుకువెళ్ళియిద్దామనుకుని బయలుదేరివచ్చా...ఇవిగో...తీసుకో...

మధు :-(చేయిజాచి రూపాయిలు తీసుకుని) బాబూ... మనిషి యింటికివచ్చి డబ్బు యివ్వటం మా తాతముత్తాతలైనాసరే ఎన్నడూ వినలేదు...

రమే :-(పీటమీద కూర్చుని) ఏం మధు...దుకాణం ఎలాఉంది ?

మధు :-బాబూ...దుకాణం ఎలానడపను? రెండణాలు, పావలా, రూపాయి లగాయతు అరవై, డెబ్భై రూపాయలువరకు అరువు లున్నాయి... యిదిగో సాయంకాలం యిచ్చేస్తాం అంటారు...ఆరునెలలయినా అతీ గతీ ఉండదు... ఓ... జెనర్జీగారా... నమస్కారం... ఎప్పుడు వచ్చారు ?

(జెన్నజ్జీ ఎడమ చేతిలో జారీచెంబు ఉంటుంది. కాళ్ళనిండా దుమ్ము చెవులకు చుట్టుకుని జందెం, ఎడమచేతిలో అరచుట్టి నాలుగు చిన్న చేపలు ఉంటాయి)

జెన్నజ్జీ :-నిన్న రాత్రే వచ్చారు. మధు... కాస్తంత పొగాకు పెట్టు...

(ఈ మాటలు అని జారీచెంబు, చేపలు క్రింద పెడతాడు)

జెన్నజ్జీ :-మధూ...ఆ పల్లెదాని పొగరు చూడు... ముద్దు, ఒక్కసారిగా నా చెయ్యి పట్టుకుంది. ఏం కాలం వచ్చిందిరా... యివి కానీకి యిచ్చే చేపలా...బ్రాహ్మణ్ణి మోసగించి ఎన్నాళ్ళు తింటుందిలే ? సర్వ నాశనమైపోరూ...

మధు :-అరే...అది మీ చెయ్యి పట్టుకుందా ?

జెన్నజ్జీ :-దానికి రెండు కానులన్నర బాకీఉన్నాను. ఈ మాత్రానికే, నిండు రేవులో అందరియెదుటా నా చెయ్యిపట్టుకోవాలా ? ఇది చూడని వాళ్లు ఎవరున్నారు ? బహిర్భూమికివెళ్ళి, జారీచెంబు నదిలో తోము కుని, కాళ్లూ చేతులు కడుక్కున్నాను. అలా రేవుమీదుగాకూడా వెడదామని బయలుదేరా... ఆ ముద్దు చిన్నబుట్టలో చేపలు పెట్టి కూర్చుంది. నన్ను చూడటంతోనే, తనంతటతాను "బాబూ... ఇవ్వాళ ఏమీలేవు...అన్నీ అమ్ముడుపోయాయి" అంది. నా కళ్లల్లో దుమ్ము కొడదామనుకుంది. అది దాని తరమా ? బుట్టలో చెయ్యి పెట్టటమే తడవు. ఛట్ న నా చెయ్యి పట్టుకుంది. అరే... ఇంతకు ముందు నీకు రెండుకానులన్నర బాకీఉన్నాను. ఇది ఒక కానీ... ఈ మూడు కానులన్నరకోసం ఊరువిడిచి పారిపోతానా ? ఏం మధు ఏమంటావ్ ?

మధు :-బాగుంది—ఈ మాత్రానికే పారిపోతారా ?

జెన్నజ్జీ ;-ఐతే చెప్పవేం మరి ? ఊరిలో ఒకరిపెత్తనం ఏడిసిందికనుకా ? లేక పోతే వాళ్లయింటికి చాకలి మంగళ్లు పోకుండా బంద్ చేసి, గుడికె ఊడబెరకి పారేసి, వాళ్ళకి బుద్ధిచెప్పకపోయానా ? హఠాత్తుగా రమేశువైపుచూసి) అరే మధు—ఈ బాబు ఎవరు ?

మధు :-మన చినబాబుగారు. శ్రాద్ధపు జమాఖర్చులో పదిరూపాయలు బాకీ ఉన్నారు. అవి యివ్వటానికి వచ్చారు.

జెనర్జీ :-సరే—రమేశబాబా—కలకాలం బ్రతుకు నాయనా— ఇక్కడికి రావటంతోనే విన్నాను. నువ్వు చెయ్యవలసిన పని ఏదో అదిచేసావ్. ఇలాంటి అన్నదానం యీ చుట్టుప్రక్కల ఎక్కడా జరగలేదు. కాని నాయనా నేను నా కళ్ళతో చూడలేకపోయాను. అదే నాకు విచారం కొంతమంది మాయమాటల్లోపడి, కలకత్తా ఉద్యోగానికని వెళ్లా-అక్కడే యింతకష్టం వచ్చింది. అరే— రామ రామ—అక్కడ మనిషైనవాడు ఉండటానికి వీలు ఉందా ?

మధు :-(పొగాకువేశి హుక్కాయిచ్చి) తరువాత—నౌకరీ గివుకరీ ఏమన్నా దొరికిందా ?

జెనర్జీ :-దొరకకేం ? ఎందుకని దొరకదు ? నాదేం వచ్చీరాని చదువను కున్నావా ? నౌకరీ దొరకడంతోనే యేమయింది ? దుమ్ము ఎంత ఉంటే, బురదఅంతే ఉంటుంది. ఇంట్లోంచి బయలుదేరు—యే బండి క్రిందన్నా పడకుండా తిరిగి వచ్చావంటే, నీ పెద్దలపుణ్యమనుకో— ఎప్పుడైనా నువు వెళ్లావా ?

మధు :-ఊహు— నేవెళ్లలా—ఒకసారి మాత్రం మేదినీపూర్ చూసా—

జెనర్జీ :-అరే పల్లెటూరిగబ్బిలాయి—కలకత్తా ఎక్కడ ? మేదినీపూర్ ఎక్కడ నేను చెప్పేది నిజమోకాదో, కొంచెం రమేశ్ బాబుని అడిగిచూడు. అరే మధు—తింటానికి లేకపోతే, పిల్లల్ని వెంటేసుకుని ముష్టి ఎత్తు కుంటా—ఎలాగైనా బ్రాహ్మడ్ని— బిచ్చ నెత్తుకోవటానికి సిగ్గే మిటి ? ఇక ఊరువిడిచి వెళ్ళేమాటే ఎత్తను. నేనుచెపితే నమ్ముతావో నమ్మవో కాని—అక్కడ ఒకటేమిటి ? ఆఖరుకు కాడకూడా కొను క్కోవలసిందే—నువ్వు తిండిఅంటూ తినగలవా ? తిండితినక యీ నెల్లాళ్ళలోనూ, నేను చిక్కి శల్యమైపోయాను.

(హుక్కా గొట్టం మధుచేతికి యిచ్చి, జెనర్జీ నూనె గిన్నెలో నుంచి నూనె తీసుకుని చేతిలో వేసుకుని కొంచెంగా ముక్కు, చెవులకు రాసుకుంటాడు, మిగిలినది మాడుకు పట్టించి మర్దనా చేసు కుంటాడు.

జెనర్జీ :-బాగా ప్రొద్దుఎక్కిపోయింది. ఒక్క మునుగు మునిగి యింటికి పోతాను. మధు ఒక కానీ ఉప్పు ఇయ్యి— డబ్బులు సాయంత్రం యిస్తాను.

మధు :-మళ్ళీ సాయంకాలమా...

(మధు విచారంతోలేచి దుకాణంలోపలికి వెడతాడు. కాగితంలో ఉప్పుపొట్లం కట్టి యిస్తాడు.)

జెనర్జి :- (పొట్లం తీసుకుని) అరే మధు... మీ అందరికి మతి పోయిందా ఏమిట్రా? నెత్తిమీద నాలుగు మొత్తి డబ్బు గుంజుదా మనుకుంటున్నారా?

(ఈ మాటలేఅని తనచేత్తో గుప్పెడు ఉప్పుతీసుకుని పొట్లంలో పోసుకుంటాడు. రమేశ్ వైపు చూసి నవ్వుతూ) ... ఇకేం దొర... వస్తావాబాబూ...మాట్లాడుకుంటూ వెడదాం...

రమేశ్ :-నాకు యింకా కొంచెం ఆలస్యం అవుతుంది.

జెనర్జి :-ఐతే...సర్... (బాకీ డెంయి తీసుకుని బయలుదేరబోతాడు)

మధు :-జెనర్జిబాబూ... ఆ మైదాపిండిబాపతు ఐదు అణాలు యిచ్చారు కాదు...

జెనర్జి :-మధూ...నీకు సిగ్గూశరం ఏమీ లేదట్రా...ఆ వెధవల మాయలోపడి కలకత్తా వెళ్ళిరావటంలో ఐదురూపాయలు తగలేశాను. పోట్లాట పెట్టుకోవటానికి నీకు యిదేసమయం దొరికిందా.ఏం? ఒకడు సర్వ నాశనంఐతే మరొకడికి కళ్యాణం... ఇదే కదూ? రమేశ్ చూడు బాబూ...వీళ్ళతరహా చూడు.

మధు :-(సిగ్గుతో) చాలారోజులయిందని...

జెనర్జి :-ఐతే...ఏం? ఇలా అంతా నా మీదపడితే యీ ఊరులో ఉండ టమే యిక కష్టమైపోతుంది.

(జనర్జి కోపంతో తనసామానులుతీసుకుని వెళ్ళిపోతాడు. వెంటనే వనమాలి ప్రవేశం. నెమ్మదిగావచ్చి రమేశ్ కు నమస్కారంచేసి నిల బడతాడు.)

రమేశ్ :-తమరు...?

వనమాలి :-తమసేవకుడు వనమాలిని...ఈ ఊరు మయినరు స్కూలు హెడ్మా స్టర్ని...

రమేశ్ :- (కొంచెం లటపటాయించి, లేచినిలబడి) మీరేనా స్కూల్ హెడ్మాష్టరు.

వనమాలి :-అవును బాబూ... నేనే ఆ సేవకుడ్ని. రెండు మూడుసార్లు మీ దర్శనానికి వచ్చాను. కాని తమర్ని కలుసుకోవటం పడలేదు.

రమేశ్ :-మీ స్కూలులో ఎంతమంది పిల్లలు చదువుకుంటున్నారు.

వనమాలి :-ఇరవై రెండుమంది పిల్లలు. ప్రతిసంవత్సరం యిద్దరు మిడిల్ పరీక్ష ప్యాసవుతున్నారు. ఒకసారి నారాయణ జోశి మూడవకొడుకు పెద్ద పరీక్షలోకూడా ఉత్తీర్ణుడయాడు.

రమేశ్ :-అలాగా ?

వనమాలి :-అవునుబాబూ... కాని యీ సారి స్కూలుపైకప్పు తెంగి బాగు చేయించకపోతే...వర్షం స్కూలువాటి అవతలమాత్రం పడదు.

రమేశ్ :-అంతా మీ నెత్తినే పడుతుందన్నమాట.

వనమాలి :- ఆ...కాని దీనికి యింకా కొంచెం కాలం పడుతుంది. ఇప్పటికి మాలో ఎవ్వరికీకూడా మూడునెలలనుంచి జీతాలులేవు. ఇంట్లో కుండలు డంకె కొడుతూంటే, బయట మెహర్బానీగా పనిచెయ్య లేమని మాస్టర్లంతా అంటున్నారు.

రమేశ్ :-మీకు జీతం ఎంత ?

వనమాలి :-జీతం ఐతే యిరవైఆరు రూపాయలు... కాని మాకువచ్చేది పద మూడు రూపాయల పదిహేను అణాలే...

రమేశ్ :-జీతం యిరవై ఆరు...ముట్టేది పదమూడురూపాయల పదిహేను అణాలా...అంటే దీని అర్థం ?...

వనమాలి :-ఇది గవర్న్మెంటు ఆర్డరో...ఏమో తెలియదు...అందుకని ఇరవై ఆరు రూపాయలకు రశీదువ్రాసి డిప్యూటీయినస్పెక్టరుకు చూపించాలి. లేకపోతే గవర్న్మెంటు గ్రాంటు బంద్ అయిపోతుంది.

రమేశ్ :-దీనిమూలంగా పిల్లలముందు మీకు నామోషీగా ఉండదూ ?

వనమాలి :-ఏమీ ఉండదు బాబూ...ఇది మామూలయిపోయింది. అదీ కాకుండా మేమంటే పిల్లలు పెద్దపులిని చూసినట్లు భయపడతారు. బెత్తంతో వీపు వాయకొట్టేస్తాం కదూ...

రమేశ్ :-ఆ...చేయవలసిందే...మిగతా మాస్టర్లకు జీతం ఎంతెంత ?

వనమాలి :-ఇరవైమూడు రూపాయలు.

రమేశ్ :-ఇరవైమూడు...ఒకడికా...ముగ్గురికా ?

వనమాలి :-ముగ్గురికి...తొమ్మిది రూపాయలు, ఎనిమిది, ఆరు రూపాయలు... కాని వేణీబాబు ఇంతకూడా యివ్వటానికి యిష్టపడడు. ఏడెనిమిది రూపాయిలైతే చాలునంటారు.

రమేశ్ :-బాగానే ఉంది...బహుశా యజమాని ఆయనే అనుకుంటా...

వనమాలి :-అవును బాబు...ఆయనే సెక్రటరీ... కాని ఎప్పుడూకూడా తన దగ్గరి డబ్బు ఒక్క దమ్మిడీకూడా యివ్వరు. ఆ...యదు ముఖర్జీ గారి కూతురు రమ సాక్షాత్తూ లక్ష్మీదేవి...ఆవిడ దయే లేకపోతే యీ స్కూలు ఎప్పుడో ఎత్తేసేవారే...

రమేశ్ :-ఏమంటున్నారు ? ఈ సంగతి నేను ఎప్పుడూ విననేలేదే...

వనమాలి :-అవును చినబాబూ... ఆవిడ దయవల్లనే యీ స్కూలు యింకా నిలబడిఉంది. ఆవిడ తమ్ముడుకూడా యిక్కడే చదువుకుంటున్నాడు. ఈ సంవత్సరం స్కూలు హైస్కూలుకూడా చేయిస్తానంది. కాని ఎందువల్లనో ఆ పని యింతవరకు జరగలేదు... ఎవరో అడ్డుపుల్ల వేసి ఉంటారు.

రమేశ్ :-ఇలాగకూడా జరుగుతూంటుందా ? మీకు ఆలస్యం అవుతున్నట్లుంది ..ఇక మీరు వెళ్ళండి...రేపు మీ స్కూలుచూడటానికివస్తాను

వనమాలి :-చిత్తం...తమదయఉంటే మాకేంలోటు...

(తిరిగి ఒకసారి నమస్కారంచేసి వనమాలి వెళ్ళిపోతాడు. రెండవ వైపునుంచి గోపాల్, భజువాల ప్రవేశం)

రమేశ్ :-గుమాస్తాగారూ... ఏం ఇలా అకస్మాత్తుగా కంగారుతో, వస్తున్నారు...

గోపాల్ :-వేణీబాబు దుర్మార్గానికి వడిగట్టాడుబాబూ... ప్రతిరోజు యిది సహించటం కష్టమైపోతుంది.

రమేశ్ :-అసలు సంగతి ఏమిటి ?

గోపాల్ :-ఇరవై రెండు సెంట్లు భూమిలో యింకాసరకు పాలుపంచలేదు. ఇప్పటివరకు ముఖర్జీగారితో బాటు కలిసి దున్నుకుంటున్నాం... ఒకభాగం వేణీబాబుది, ఒకభాగం మనది. మిగతాది వారిది. ఆ రోజున వాళ్లు పెద్ద చింతచెట్టు కొట్టుకుని పంచుకున్నారు. మనకు కొత్త

ముక్కయినా యివ్వలేను. మీతో చెపితే కాస్తంత కొయ్యముక్క కోసం పోట్లాట దేనికన్నారు ?

రమేశ్ :-నిజమే గుమస్తాగారూ .. చిన్న కొయ్యముక్క కోసం పెద్దప్ప య్యాతో, తగాదా పెట్టుకుంటామా ?

గోపాల్ :-ఇక చాలుబాబూ... ఈ ఔదార్యంవూరుకునే వేణీబాబు యివ్వాళ చెరువులో చేపలు జబర్దస్తీగా పట్టించుకుపోయారు. బహుశా యీ పాటికి ముఖర్జీగారి యింటివద్ద పంపకం జరుగుతూంటుంది.

రమేశ్ :-ఇందులో మనకు వాటాఉందని మీకు బాగా తెలుసునా ?

గోపాల్ :-తెలియకపోవటమేమిటి చినబాబూ... ఈ వ్యవహారాలలో నా తల ఊరికే నెరిసిపోయిందా ?

రమేశ్ :-రమ చాలా ధర్మపురురాలని అంతా అంటారుగా ఆమెను ఒకసారి అడిగి చూడకపోయారా ?

గోపాల్ :- "ఆస్తిఅంతా మాకు వప్పగించి మూటాముల్లె కట్టుకుని ఎక్కడ నుంచి వచ్చాడో అక్కడికి నడవమని, చినబాబుతో చెప్పు" అని ఆవిడ నవ్వుతూ అందని విన్నాను. జమీందారీని కాపాడుకోవటం పిరికివాళ్ళ పనికాదు అనికూడా అన్నదట.

రమేశ్ :-బహుశా దొంగతనం చేయటంకూడా సాహసకృత్యమేనని అను కుంటున్నారన్నమాట. భజువా నీ దగ్గర లాఠీకర్ర ఉందా ?

భజువా :-(లాఠీ పైకెత్తి) ఉంది బాబూ...

రమేశ్ :-వెళ్లి చేపలన్నీ లాక్కురా ? ఒక్కడివీ తీసుకురాగలవా ?

భజువా :-(తలవంచి) మీరు 'ఊ' అనాలి...అంతేబాబూ...

(భజువా వెళ్ళబోతాడు)

గోపాల్ :-(ఒక్కసారిగా భయంతో) కాని...చినబాబు...దొమ్మీ జరిగి పోతుంది.

రమేశ్ :-ఐతే మరి ఏం చేద్దాం ?

గోపాల్ :-ఇలా ఒక్కసారిగా యింతపనిచెయ్యటం మంచిదికాదుబాబూ...

రమేశ్ :-మరి ఏం చేద్దాం అంటారు ?

గోపాల్ :-ఐతే...ఊ...ఠాణాలో రిపోర్టుచేద్దాం...పోనీ ఒకసారి వాళ్ళని బాగా అడిగిచూస్తే...

రమేశ్ :-ఐతే అలాగే చేయండి. మనలాంటి పిరికివాళ్ళకు యింతకంటె ఎక్కువ చెయ్యటం ఉచితంకూడా కాదు. భజువా... ఆ యింటి అమ్మగారు నీకు తెలుసుగా... తెలుసునా? ఐతేసరే... వెళ్ళి ఆ చెరువు చేపలలో మనకు వాటా ఉందో, లేదో అడిగిరా... ఉంది అంటే చేపలు తీసుకురా... లేదుఅంటే మాట్లాడకుండా తిరిగిరా... నాలుగైదు చేపలకోసం రమ అబద్ధమాడదని నాకు పూర్తివిశ్వాసం ఉంది గుమాస్తాజీ... (భజువా త్వరగా వెళ్ళిపోతాడు)

# 5

(వేణుబాబు యింట్లో విశ్వేశ్వరిగది... రమ ప్రవేశం... దాసీది ఎదురుగా వస్తుంది)

రమ :-నందమ్మా... పెద్దమ్మ ఎక్కడుంది?

దాసి :- ఇంకా పూజనుంచి బయటకు రాలేదమ్మా... ఏం... అమ్మా పిలవ మంటారా?

రమ :-ఆవిడపూజ చెడగొట్టడం దేనికి? వద్దు... నేను కూర్చుంటానులే... యివతలికి రాగానే నేవచ్చానని చెప్పు...

దాసి :-అలాగేనమ్మా...

(దాసీ వెళ్ళిపోతుంది... కొంచెం సేపట్లో నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ యతీంద్రుడు ప్రవేశిస్తాడు)

యతీంద్ర :-అక్కయ్యా...

రమ :-(ఉలిక్కిపడి మొగం ప్రక్కకు త్రిప్పుతుంది)... అరే... ఎక్కడినుంచి వస్తున్నావురా?

యతీంద్ర :-నేను నీ వెనకనే వస్తున్నాను... చూడలా...

(ముందుకువచ్చి రమను కౌగలించుకుంటాడు)

రమ:- ఏం వెంకివాడవురా?... వేళయింది... బడికిపోవూ...

యతీంద్ర :-మాకు యివ్వాళ శెలవు అక్కయ్యా...

రమ :-శెలవా... ఎందుకు? ఇవాళ్ళ బుధవారమేగా...

యతీంద్ర :-బుధవారం ఐతేనేం ? ఇవాళ్ళ, రేపు, శుక్రవారం, శని ఆదివారాలు...ఒక్కసారిగా ఐదురోజులు స్కూలు శెలవే...

రమ :-ఎందుకనిరా ?...

యతీంద్ర :-మా స్కూలు పైకప్పు కొత్తది వేస్తున్నారు. ఆ తర్వాత సిమెంటు చేస్తారు. ఎన్నో పుస్తకాలు వస్తాయి...బెంచీలు కుర్చీలు, బల్లలు కూడా వస్తాయి... పెద్ద అలమారు, పెద్ద గడియారం తెస్తారు... ఎప్పుడైనా నువ్వువచ్చి ఒకసారి చూడు అక్కయ్యా...

రమ :-అరే...ఏమిట్రా నువ్వనేది ?

యతీంద్ర :-నిజమే అక్కయ్యా... రమేశ్ బాబు వచ్చారుగా... ఆయనే యిదంతా చేయిస్తున్నారు. ఇంకా ఏవేవో చేస్తారట...ఆయనరోజూ రెండుగంటలపాటు మాకు పాఠాలుకూడా చెప్తారట...

రమ :-ఏంరా...యతీ...ఆయనకు నువ్వు గుర్తుంగా ?

యతీంద్ర :-ఆ...

రమ :-ఆయన్ని ఏమని పిలుస్తావురా...

యతీంద్ర :-మేమంతా చినబాబు అంటాం...

రమ :-(తమ్ముడ్ని దగ్గరకు లాక్కుని కావలించుకుని) చినబాబు ఏమిట్రా... ఆయననీకు అన్నయ్య...

యతీంద్ర :-ఛత్

రమ :ఛత్ ఏమిటి ? వేణీబాబును పెద్దన్నయ్యా అని పిలవటంలా... అలాగే ఆయనను చిన్నన్నయ్యా అని పిలు...

యతీంద్ర :-నాకు అన్నయ్య అవుతారా ? నిజమేనా అక్కా

రమ :-నిజమే...ఆయన నీకు అన్నయ్య...

యతీంద్ర :- ఐతే యింటికివెళ్ళి...నర్సూ, హరా సంతా అందరితో చెప్పతాను...ఏం చెప్పిరానా ? (రమ వద్దని తల ఆడిస్తుంది)

యతీంద్ర :-ఎందుకని అక్కయ్యా...మరి యిన్నాళ్లు ఆయనఎక్కడున్నారు?

రమ :-చదువుకోవటానికి పరదేశంవెళ్ళారు. యతీ...నువ్వు పెద్దయ్యాక ఇలాగే చదువుకోసం నన్నువదలి వెళ్ళాలి. నన్నువిడిచి ఒంటరిగా ఉండగలవా?

యతీంద్ర :-(రెండు మూడుసార్లు సందేహంగా తలఆడించి) ఏం అక్కయ్యా ...చిన్నన్నయ్య చదువంతా పూర్తయిపోయిందా ?

రమ :-ఆ...అయిపోయింది.

యతీంద్ర :-నీ కెలా తెలుసు ?

రమ :-(కొంచెంసేపు ఊరుకుని) చదువు పూర్తికాకపోతే, యితరుల పిల్లవాళ్ళ కోసం యిన్ని రూపాయలు ఎలా యివ్వగలరురా ? ఈ చిన్న విష యమే నీకు తెలియలా ?

యతీంద్ర :-(తెలుసునని తలఆడిస్తాడు) ఐతే అక్కా ...చిన్నన్నయ్య మన యింటికి రారేం ? మన పెద్దన్నయ్య రోజూ వస్తారుగా...

రమ :-నువ్వు పిలుచుకురాగలవా ?

యతీంద్ర :-ఇప్పుడే వెళ్ళనా అక్కా ?

రమ -(భయంతో వాడిని రెండుచేతులతో దగ్గరకు తీసుకుని) ఏం పిచ్చి పిల్లవాడివిరా...జాగ్రత...యతీ...యెప్పుడూ యిలాంటి పని చేయబోకు...చెయ్యకు...

యతీంద్ర :-అక్కయ్యా, కళ్ళనీరు పెట్టుకుంటావేం ? నువ్వు చెయ్యవద్దన్నది ఎప్పుడూ నే చెయ్యనుగా...

రమ :-(కళ్ళు తుడుచుకుని) నువ్వు చెయ్యవని తెలుసు... నారాజా తమ్ముడివి కదూ...అందుకని...

యతీంద్ర :-ఇంటికి వెడదాం రా అక్కా...

రమ :-నువ్వుపో... నే తర్వాత వస్తాలే...

(యతీంద్రుడు వెళ్ళిపోతాడు. విశ్వేశ్వరి ప్రవేశిస్తుంది)

విశ్వే :-అమ్మాయ్...మీరంతా ఏమిటమ్మా యిలా చేస్తున్నారు ? దొంగతనా నికి నువ్వు వాడికి ఎందుకు సాయం చేశావ్ ?

రమ :-ఈపని చెయ్యమని నేను చెప్పలేదమ్మా...

విశ్వే :-రమా...నువ్వు స్పష్టంగా చెప్పిఉండకపోవచ్చు...ఏమైనా నీ తప్పు కూడా తక్కువేమీ లేదు.

రమ :-ఏంచెయ్యను పెద్దమ్మా...అప్పుడు అంతకంటె దారి దొరకలేదు. భువా లాక్కుపుచ్చుకుని యింటిలోనికివచ్చి నిలబడే సరికే, చేపల పంప

కం పూర్తయిపోయింది. పెద్దన్నయ్య తనభాగం తీసుకుని వెళ్ళి పోయారు. మిగిలినవాళ్ళు తలో నాలుగూ తీసుకుని పోయారుకూడా..

విశ్వే :-రమా...అసలు వాడు చేపలభాగం పనులు చేసుకోవటానికి రాలేదు. రమేశ్ మాంసం అసలు ముట్టనేముట్టడు. అందుకని వాడికి వీటి అవసరమే లేదు కూడాను. ఆ చెరువు చేపల్లో తనకు వాటా ఉన్నదో లేనిదీ తెలుసుకోవటానికే భజువాను నీదగ్గరకు పంపించాడు. దానిలో వాడికి భాగం లేదని నీ నోటితో ఆమాట యెలా అన్నావో నువ్వే చెప్పు... (రమ తల వంచుకుంటుంది)

విశ్వే :-నువ్వంటే వాడికి యెంత ప్రేమ, విశ్వాసం ఉందో నీకు తెలియదమ్మా... కాని యీ విషయం నాకు బాగా తెలుసు. ఆరోజున చింతచెట్టు కొట్టించి మీరిద్దరూ పంచుకున్నారు. గోపాల్ గుమాస్తా చెప్పినమాటలు రమేశ్ యేమీ పట్టించుకోలేదు. మనకు వాటాఉంటే వస్తుందిలే. రమ నన్నెప్పుడూ మోసం చెయ్యదు. అన్నాడు. కాని నిన్న నువ్వు చేసింది...సరే పోనీ... కాని ఒక్కమాట చెపుతున్నా డబ్బు, సంపదల విలువ యెంతయినా అవనీ, కాని మానవుడి ప్రాణపు విలువ దానికంటె యెన్నో రెట్లు యెక్కువ...ఇదుగో రమా...నువ్వు యెన్నడూ యితర్లమాటలు నమ్మి, మాయలోపడి వాడిని నాల్గువైపులా దెబ్బకొట్టి నాశనం చెయ్యకు. దీనివల్ల యేదైతే కోల్పోతావో...అది మళ్లీ నీకు లభించదు...

రమేశ్ : (లోపలినుంచి);...పెద్దమ్మా...

(రమేశ్ లోపలికి రావటంతోనే, రమ తలవంచుకుని, వెనక్కితిరిగి కూర్చుంటుంది.)

విశ్వే :-రెండు జాములప్పుడు యకాయకీ యిలా వచ్చావేం నాయనా ?

రమేశ :-ఇప్పుడు రాకపోతే నీదగ్గర కూర్చోటానికి వీలు ఎక్కడుందమ్మా... నీకు యెన్నో పనులుంటాయ్...యెందుకమ్మా...నవ్వుతావ్...సరే కాని పెద్దమ్మా...నీకు జ్ఞాపకం ఉందా ? సరిగా యిదే సమయంలో, నా చిన్నతనంలో యేడుస్తూ నీదగ్గర శలవు తీసుకున్నాను. అలాగే యివ్వాళకూడా నీదగ్గర శలవు తీసుకోటానికి వచ్చాను. కాని పెద్దమ్మా...యిదే ఆఖరుసారి శలవు తీసుకోవటం మనుకుంటా...

విశ్వే :-రామ...రామ...ఏమిటి నాయనా అంటున్నావ్ ? ఇలారా దగ్గరకువచ్చి కూర్చో...

(రమేష్ దగ్గరకూర్చుని నెమ్మదిగా నవ్వుతాడు ఏమీ జవాబుఇవ్వడు. విశ్వేశ్వరి ప్రేమతో అతని తల, వీపు నిమురుతుంది.)

విశ్వే :-ఏం నాయనా...ఇక్కడ నీవంట్లో కులాసాగా ఉండటం లేదా ?

రమే :-పెద్దమ్మా...నాది రొట్టెతో పెరిగిన శరీరం... ఇది అంత సులభంగా చెడిపోదు. ఏమైనా ఒక్కరోజుకూడా యిక్కడ ఉండలేను. ఇక్కడ నాకు ఊపిరి ఆడేట్టులేదు.

విశ్వే :-నీకు వంట్లో కులాసాగా ఉందని విని నా మనస్సు కుదుటపడింది నాయనా... కాని యిది నీ జన్మభూమి... ఎందుకని యిక్కడ ఉండలేవు ?

రమే :-అది నేను చెప్పను...నీకు అంతా తెలుసుననే నా నమ్మకం...

విశ్వే :-అంతా కాకపోయినా కొద్దిగానన్నా తెలుసు. కాని రమేష్... ఈ మాత్రానికే నిన్ను వెళ్ళనివ్వను.

రమే :-ఇక్కడ ఎవ్వరికీ నేను అవసరంలేదు పెద్దమ్మా...

విశ్వే :-ఇతరులకు నీ అవసరంలేదని, పారిపోవటంవల్ల ప్రయోజనంలేదు నాయనా. ఇప్పుడేగా నీది రొట్టెతో పెరిగిన శరీరంఅన్నావ్... ఇది పారిపోవటానికేనా ? సరేలే యిది నిజమేనా...చెప్పు... గోపాల్ గుమాస్తా చెప్పాడు. ఏదో రోడ్డు మరమ్మతుకోసం చందా పోగు చేస్తున్నావుటగా...ఏమయింది ?

రమే :-సరే యీ ఒక్కమాట నీకు చెపుతాను. ఆ రోడ్డు ఏదో నీకు తెలుసు. పోస్టాఫీసుముందునుంచి స్టేషనుకుపోతుందే...అదేరోడ్డు... ఎప్పుడో ఐదుసంవత్సరాలక్రితం వర్షాలకు చెడిపోయింది... ఇప్పుడు మధ్యలో పెద్ద గండికూడా పడిపోయింది. జనంఅంతా జారిపడి కాళ్లూ చేతులూ విరగకొట్టుకుంటున్నారు. కాని దాని మరమ్మతు చేయించటంలేదు. ఇరవై రూపాయలు ఐతే చాలు... దీనికోసం పదిరోజులు తిరిగినా పదణాలైనా వసూలుకాలేదు. నిన్నరాత్రి మధు కొట్టుముందునుంచి వస్తున్నాను. ఎవ్వరో ఒక్కదమ్మిడీకూడా యివ్వవద్దని ప్రచారం చేస్తున్నాడు. పెద్దపెద్ద బూట్లు వేసుకుని, దర్జాగా బళ్ళమీద పోయే వాళ్ళకు దీని అవసరం... ఎవరిచ్చినా యివ్వకపోయినా వాళ్లే బాగు

చేయించుకుంటారు. ఊరకే వాళ్ళని "బాబూ... బాబూ" అంటూంటే చాలు...అన్నీ జరిగిపోతాయని అంటున్నాడు.

విశ్వే :-(నవ్వి) వాళ్లు అలాఅంటున్నపుడు, బాగుచేయించరా నాయనా... తాతముత్తాతలు సంపాదించి యిచ్చారుగా...

రమే :-(కొంచెం పెంకిగా) నేనెందుకివ్వాలి? అనవసరంగా, యీ విషయాలన్నీ తెలుసుకోకుండా, స్కూలుకు యింతదెబ్బ తగలేశానే అని యిప్పుడు విచారపడుతున్నా... ఈ ఊళ్లో ఎవరికోసంకూడా ఏ పని చెయ్యకూడదు. వీళ్లు పరమనీచులు...దానం చేసినా, మంచిచేసినా, స్వార్థంకోసం చేశాడంటారు... క్షమించటంకూడా అపరాధమే... జడిసి వదిలేసాడంటారు... (విశ్వేశ్వరి నవ్వటం ప్రారంభిస్తుంది)

రమే :-నవ్వుతావేం పెద్దమ్మా?

విశ్వే :-నాయనా... నవ్వక ఏంచెయ్యను? ఐతే కోపంతో వీళ్ళని వదలి వెళ్ళిపోదా మనుకుంటున్నావా? రమేశ్ వీళ్ళ యింతమచ్చలలో, అజ్ఞానంతోకూడిన నిర్భాగ్యులో తెలుసుకుంటే, కోపగించుకోవు నాయనా...పైగా కోపగించుకోవటానికి సిగ్గుపడాలి... (రమతో) అమ్మాయ్...ఇందాకటనుంచి తలవంచుకునే కూర్చున్నావ్...? ఏం రమేశ్ మీరిద్దరికీ మాటలులేవా?

రమ :-(అదోవిధంగా తలవంచుకుని) పెద్దమ్మా... నాకేం విరోధంలేదు... రమేశ్

రమేశ్ :-(ఉలిక్కిపడి) ఆ... రమా... ఒక్కదానివే వచ్చావా... పిన్నమ్మనుకూడా వెంటేసుకొచ్చావా?

విశ్వే :-రమేశ్! యేమిటి నాయనా అంటున్నావ్...? ఇద్దరూ ఒకరినొకరు సరిగా అర్థంచేసుకోలేరు. అందుకని...

రమేశ్ :-చాలు పెద్దమ్మా... నన్ను మాత్రం క్షమించు...ఇంతకంటె ఎక్కువగా తెలుసుకోవాలని ఆశీర్వదించకు... ఇంటికి వెళ్ళి పిన్నమ్మను తీసుకువచ్చిందా అంటే, ఆవిడ నన్ను నిన్నూకూడా నమిలి మింగేస్తుంది... అప్పుడుగాని తిరిగి ఇంటికి పోను. బాప్ రే...పారిపోతా...

విశ్వే :-రమేశ్...వెళ్ళకు...ముందు యీ మాటవిను.

రమేశ్ :-(ఆగి) వద్దు పెద్దమ్మా... అంతా విన్నాను... అహంకారంతో,

నిన్నుకూడా నెట్టిపారేసి పోదలచుకున్నవాళ్ళ పక్షాన మాత్రం ఒక్క మాటకూడా చెప్పకు... నీకు అవమానం జరిగితే నేను సహించలేను...

(తొందరగా వెళ్ళిపోతాడు)

రమ :-(విశ్వేశ్వరివైపు చూసి యేడుస్తూ) పెద్దమ్మా... నిన్ను అవమానించటానికి పిన్నిని పంపుతానని, యీ కళంకం నామీద వెయ్యటం దేనికమ్మా?

విశ్వే :-(రమను దగ్గరకు లాగుకుని) అమ్మా... వాడు నిన్ను తప్పుగా అర్థం చేసుకున్నాడు. కాని నిజమేదో...ఒకరోజున వాడే స్వయంగా తెలుసుకుంటాడు.

## రెండవ అంకం

(తారకేశ్వరపు రోడ్డు. సూర్యుడు ఉదయించి కొద్దిసేపవుతుంది. రమ దగ్గర చెరువులో స్నానంచేసి తడిబట్టలతో తిరిగి వస్తూంటుంది. అకస్మాత్తుగా రమేశ్ ఆమెకు యెదురౌతాడు) ఒకసారి తలమీదకొంగు ముందుకు లాగుకోవటానికి ప్రయత్నిస్తుంది. కాని తడిబట్టకావటంవల్ల సాధ్యపడదు. తొందరగా చంకనున్న కడవ క్రిందికి దింపి తడిపైటలోనుంచి రెండు చేతులతో వక్షస్థలాన్ని కప్పుకుంటుంది. కొంచెం ముందుకు వంగి నిలబడి ఉంటుంది.)

రమ :-మీరు యిలా వచ్చారేం?

రమే :-(ఒక ప్రక్కకు తప్పుకుని) నే నెవరో మీకు తెలుసా?

రమ :-ఆ...తెలుసు...తారకేశ్వరం యెప్పుడొచ్చారు?

రమే :-ఇప్పుడే బండి దిగి వస్తున్నాను. మా మామగారి తాలూకు ఆడవాళ్ళు యిక్కడికి వస్తామన్నారు. కాని రానేలేదు.

రమ :-ఎక్కడ బసచేశారు?

రమే :-ఎక్కడాలేదు. ఇదివరకు యెప్పుడూ నేను యిక్కడికి రాలేదుకూడా.

ఇవ్వాళ యెక్కడో ఒక్కచోట యేదోవిధంగా గడిపివేయాలి. నస తెగుక్కుంటా...

రమ :-మీ వెంట భజువా వచ్చాడా ?

రమే :-లేదు...ఒక్కడ్నే వచ్చాను.

రమ :-మంచి మాటే...(ఈ మాటలే అని రమ కొద్దిగా నవ్వుతుంది. తల యెత్తి చూడటంతోనే యిద్దరి కళ్ళు ఒకసారి కలుసుకుంటాయి. మొగం క్రిందికి దించుకుని కొద్దిగా సంశయిస్తూ అంటుంది.) అయితే నా వెంట రండి.

(నేలమీదనున్న కడవ యెత్తుకుని ముందు నడుస్తూంటుంది.)

రమే :-నేను రావటానికేం ... వస్తాను. యెందుకంటే నేను రావటంలో ఏమాత్రం తప్పుఉన్నా... మీ రెప్పుడూ పిలిచి ఉండరు. మిమ్మల్ని గుర్తుపట్టలేననీ కాదు...కాని నాకు తమరెవరో జ్ఞాపకం రావటంలేదు. మిమ్మల్ని ఎక్కడో స్వప్నంలో చూసినట్టుగా గుర్తుంది. తమరెవరో చెపుతారా...

రమ :-నా వెంటరండి...వెడుతూ వెడుతూ దారిలో చెపుతాను. పోనీ స్వప్నం ఎప్పుడు చూసిందీ...జ్ఞాపకం ఉందా ?

రమే :-లేదు...మీ వాళ్లెవరూ మీతో లేరా ?

రమ :-లేరు... ఒక దాసీదిఉంది... అదయినా మకాంలో ఉంది. నౌకరు బజారు వెళ్లాడు. అవీకాకుండా నేనుయిక్కడికి తరచు వస్తూంటాను. ఇక్కడి ప్రతిసీధీ నాకు బాగా తెలుసు.

రమే :-కాని...తమరు నన్ను వెంట ఎందుకు తీసుకెళుతున్నారు ?

రమ :-లేకపోతే మీకు తిండి సదుపాయం దొరకదు.

రమే :-దొరకకపోతే పోనీ...దీనివల్ల మీకేం నష్టం ?

రమ :-మగవాళ్ళకు ఏ విషయమయినా తెలియచెప్పవచ్చు... కాని యిదొక్కటే చెప్పటం కష్టం. నేను రమని...

రమే :-రమా ?

రమ :-ఆ...ఎవరి పరిచయం చేసుకోవటం మీకు అసహ్యమో, ఆ రమనే ..

రమే :-కాని నన్నెక్కడికి తీసుకు పోతున్నావ్ ?

రమ :-మాయింటికి...అక్కడ పిన్ని లేదులెండి...మీరేం భయపడ నక్కరలా...రావచ్చు... (నిష్క్రమణ)

# 2

(తారకేశ్వరంలో రమ యిల్లు. సాధారణపు పక్కపరచి ఉంటుంది. రమేశ్ దానిమీద కూర్చొని ఉంటాడు... రమ గాబరాగా వస్తుంది)

రమ :-మీరు మొత్తానికి మంచివారే... ఇంకా కాసిని కూరగాయలు తీసుకు రావటానికి యింట్లోకి వెళ్లానో లేదో... మీరు లేచి కాళ్లూ చేతులూ కడుక్కొని దర్జాగా బుద్ధిమంతుడిలా పక్కమీద కూర్చున్నారా ... అసలు మీ రెందుకులేచారో చెప్పండి?

రమే :-భయంవల్ల...

రమ :-భయంవల్లనా...ఎవరి భయం? నాదా?

(ఈ మాటలే అని రమ దగ్గరగా కూర్చుంటుంది)

రమే :-నీ భయం ఎలాగూ ఉండనేఉంది పైగా యింకొకటి... కొంచెం జ్వరం వచ్చినట్టుగా ఉంది...

రమ :-జ్వరం వచ్చినట్లుందా? ఐతే మీరు ముందే, ఎందుకు చెప్పలేదు? స్నానంచేసి భోజనానికని ఏమని కూర్చున్నారు...

రమే :-మామూలుగానే అనుకుని కూర్చున్నాను. ఇంతటి ప్రయత్నంచేసి, ఆదరంతో తిండి పెట్టేవాళ్ళను, భోజనం చెయ్యటని నిరాశపరచటం యేమంత సబబంటావ్? జ్వరం వస్తేరానీ...మందు త్రాగితే పోతుం దనుకున్నా...నీ చేతి వంట తినకుండా వెడితే, అది యిక జన్మలో పూర్తికాదు.

రమ :-చాలు...ఇక ఆపండి...ఈ పరాయిచోట జ్వరంవస్తే యెంత కష్ట పడాల్సి వస్తుందో మీరే చెప్పండి...

రమే :-కష్టం ఉంటే ఉండవచ్చు...కాని ఏ రాణీని యింతగా చూశానో, ఆమె చేతివంట భోజనం చెయ్యకపోవటం మాత్రం సామాన్యమైన నష్ట మంటావా?

రమ :-ఇంత చెప్పినా మళ్ళీ అదే అంటున్నారు. ఈ పొరుగూరిలో నేను సరిగా యేర్పాటు చేయలేకపోయాను.

రమే :-ఏర్పాటు విషయం ఆలోచించేవారు ? ఆదరం, సత్కారం ఏమీ ఆలోచిస్తున్నా...ఇప్పైనా నాకు యింకెక్కడ దొరుకుతుంది ?

రమ :-(సిగ్గుతో) ఇక్కడ మిమ్మల్ని ఆదరించేవాళ్లే తక్కువయ్యారా ?

రమే :-ఇలాంటి ఆదరం యెక్కడ నాకు దొరుకుతుందో నువ్వే చెప్పు ? చిన్నతనంలోనే అమ్మ చనిపోయింది. తర్వాత కొన్నాళ్ళు పెద్దమ్మ దగ్గిరున్నా...అప్పుడే మామయ్యగారింటికి వెళ్ళిపోయా... అత్తయ్య అప్పటికే చనిపోయింది. అందువల్ల ఇల్లంతా ఒక హోటలులా ఉండేది. చదువుకు తర్వాత ఆలహాబాదు పోయాను. అక్కడకూడా హోటలే గతయింది. తర్వాత యింజనీరింగు కాలేజీకి వెళ్ళా. అక్కడ చాలా రోజులు ఉండవలసివచ్చింది...కాని చిన్నతనంనుంచి హోటలులో ఉండాల్సివచ్చిన దురదృష్టం... తీరనేలేదు. తిండి ఉంటే తినడం... లేకపోతే బాధించే శత్రువూ ఉండదు... తినమని బలవంతంచేసే ఆప్తుడూలేడు. (రమ మాట్లాడదు.)

వంట్లో బాగాలేదు... అందుకని మనస్ఫూర్తిగా తినలేకపోయాను. అయినప్పటికీ యిది నా జీవితానికి ప్రథమ సుప్రభాతంలా ఉంది. నా జీవితపు పద్ధతి అంతా ఒక్కసారిగా మారిపోయినట్లుంది.

రమ :-(తలవంచుకునే) ఈ మాటలన్నీ ఊరికే పెద్దంతగా పెంచి చెప్తున్నారేం?

రమే :-పెంచి పెద్దగా చెప్పేశక్తి ఉంటే అలాగే చెప్పేవాడ్ని. కాని ఆశక్తి నాలో లేదు.

రమ :-పోనీలెండి...అదీ నా అదృష్టమే...లేకపోతే ఆ శక్తి మీకుఉంటే బహుశా నేను పారిపోవాలసివచ్చేదేమో...ఇంటికి వెళ్ళి మీరు నన్ను తిట్టకుండా ఉండటంకూడా నా అదృష్టమే...నలుగురికీ పిలిచి "రమ నన్ను భోజనానికి పిలిచి కడుపునిండా తిండికూడా పెట్టిందికాదు." అని చెప్పకుండా ఉండేవారా...

రమే :-కాదు రాణీ...నిందించను, ప్రశంశించనుకూడా... ఈ రోజు నాకు నిందాప్రశంసలకు అతీతమైనది. నిజానికి తినటంలో కడుపు నిండటమే కాకుండా యింకొకటికూడాఉంది. ఇంతకుముందు అదినాకు తెలియనే తెలియదు.

రమ :-ఇవ్వాళే మీకు మొదటిసారిగా తెలిసిందన్నమాట ?

రమే :-ఆ...ఇవ్వాళే తెలిసింది...

రమ :-ఇంతకింతకు యింకా యెక్కువ తెలుసుకోవలసిన అవసరం ఉంది. కాని అప్పుడు నాకు కబురుమాత్రం పంపించండి.

రమే :-దీని అర్థం ?

రమ :-ప్రతిమాటకు అర్థం తెలుసుకోవాలనుకోవటంలోకూడా అర్థం అంటూ ఉందా రమేశ్ ? సరే...నిజం చెప్పండి...మీరు నన్ను అసలు గుర్తు పట్టనేలేదా ?

రమే :-బాగుంది...ఎలా గుర్తుపట్టగలనో నువ్వేచెప్పు. ఎప్పుడో చిన్నప్పుడు చూశాను. తిరిగి వచ్చినతర్వాతకూడా నీమొగం చూడటానికి వీలే లేకపోయింది. చూద్దామని ప్రయత్నం చేసినప్పుడల్లా, నువ్వు మొగం త్రిప్పుకుని రెండవవైపు చూసేదానివి. అందువల్లనే ఇవ్వాళ, నీ మొగం యెక్కడో స్వప్నంలో చూసినట్లనిపించింది. ఇటువంటి స్వప్నం...

రమ :-సరేలెండి...ఐతే మీరు రాత్రికి యేం భోంచేస్తారు ?

రమే :-ఏది దొరికితే అదే...

రమ :-మీరు యింత నిర్లక్ష్యంగా వుంటారే? ఏపనిమీద మీకు శ్రద్ధలేదని, ఏవస్తువు యెక్కడవుందో, ఏది యెక్కడికి పోతుందో మీకేంపట్టింపు లేదని విన్నాను. దేనిమీదా మీకు మమతలేనట్లుగా, ప్రతీ[illegible]ంలో మునిగి తేలుతున్నట్లు అనుకుంటున్నారా ?

రమే :-నామీద యీ అపవాదులన్నీ యెవరిదగ్గర విన్నావ్ ?

రమ :-తెలుసుకుని యేంచేస్తారు? ఏం, యింటికి వెళ్ళి వాళ్ళతో పోట్లాడతారా ?

రమే :-నేనేం అందరితో వూరికే పోట్లాడుతూ వున్నానా ?

రమ :-అదే చేస్తుంటారు. వచ్చినప్పటినుంచి నాతో పోట్లాడుతూనేవున్నారు. విన్నేనా, యింటికి యజమాని? మిమ్మల్ని అలా అనమని నేనేం చెప్పిపెట్టేనా, నా ముగంకూడా చూడటం మానివేసేరు. పెరట్లో చేపలు నేనేం దొంగలించేనా నాదగ్గర ఫిర్యాదుచేయడానికి మనిషిని పంపించేరు ?

రమే :-ఫిర్యాదేం చేయలేను. కేవలం జవాబు మాత్రమే అడిగేను. ఆ జవాబు వల్ల అమర్యాద ఏమీ కలగలేదుగా, రాణీ...

రమ :-కలగకపోవచ్చు...అమర్యాద కలగలేదనేనా, దానిని భరించేభారం అంతా నా నెత్తిమీద పారేశారు. దీనిని నేనేం తెలుసుకోలేనా ? ఈ దండనయేమిటో నారు తెలియదనుకున్నారా... ? ఊళ్లో మీకు వ్యతిరేకంగా యెవరు యేంచేసినా ఆ జవాబుదారి నాదేనాయేం ? కోపం అంతావచ్చి నా నెత్తినే పడాలా... పరదేశంనుంచి మీరు యిదే న్యాయం నేర్చుకుని వచ్చారనుకుంటూ...

(దాసీ ప్రవేశం)

దాసీ :-అమ్మా... సామానులన్నీ కట్టేశాం... తొందరపడకపోతే ఆరుగంటల బండి దొరకదు.

రమ :-దీనికి యింత తొందర దేనికే ?

దాసీ :-మబ్బు పట్టింది...రాత్రికి బాగా వర్షం కురిసేట్టుంది.

రమ :-కురవనీ...మీరేం సైదానంలో కూర్చోలేదుగా...

దాసీ :-లేదమ్మా...వాళ్ళతో వెళ్ళి చెపుతా... (నిష్క్రమణ)

రమే :-సాయంత్రం బండికి మీరు వెడదామనుకున్నారా ?

రమ :-ఆ...మరి మీరు ?

రమే :-నేనా...రేపు యేదోవిధంగా యిక్కడ గడపవలసి ఉంటుంది ?

రమ :-ఒకటి మీవంట్లో బాగాలేదు...పైగా వర్షాకాలం. అసలు యెక్కడ ఉందామని ?

రమే :-ఎక్కడో ఒకచోట ఉంటాను. ఇంతమంది యిక్కడికి పూజకు వస్తు న్నారు...వాళ్లు యెక్కడో ఒకచోట ఉంటున్నారుగా.

రమ :-వాళ్ళకు ఉండటానికి చోటుఉంది. మీరేం పూజ చెయ్యటానికి రాలేదుగా...మిమ్మల్ని యెందుకు ఉండనిస్తారు ?

రమే :-(నవ్వి) వాళ్ళ మొగాన వ్రాసి ఉంటుందా ?

రమ :-(నవ్వుతూ) ఆ...వ్రాసే ఉంటుంది. భక్తులు తారకేశ్వరుని దయవల్ల అది తెలుసుకో గల్గుతారు. ఆ భక్తుల్ని దూరంగా తరిమేస్తారు. పక్క గిక్కా యేమన్నా మీతో తెచ్చుకున్నారా ?

రమే :-తీసుకురాలేదు. పక్కబట్టలు తీసుకువెళ్ళమని వాళ్లు అన్నారుకూడా

రమ :-మహా గొప్పయేర్పాటే. ఒంట్లో బాగాలేదు. మబ్బుకూడా పట్టింది. తోడు నోకళ్లు యెవ్వరూలేరు. కప్పుకోటానికీ లేదు...పక్కాలేదు.

తిండి యేర్పాట్లు అసలేలేవు. అయినా యేం దిగులులేదు. ఏది ఎప్పుడు యెలా వస్తుందో...అదికూడా ధైర్యమే. అచ్చంగా పరమహంస స్థితిలా ఉంది. ఆఖరికి మీరు యిల్లాంటి యోగం పట్టిందే ?

రమే :-ఎవరికైతే యెవళ్లూ ఉండరో వాళ్ళకి వాళ్లే అవుతారు.

రమ :-అదే కనపడుతోంది. పోనీ యివ్వాళ యిక్కడే వుండండి.

రమే :-కాని యింటివాళ్ళు...

రమ :-వాళ్ళకు యేమీ బాధ కలగదు. ఇల్లాంటి పనికిమాలిన వాళ్ళపైన వారికి మంచి దయ...ఉండనిస్తారుకూడా...

రమే :-కాని రమా...యీ పక్కను నువ్వు యిక్కడే వదిలివెయ్యాలి...

రమ :-ఆ...వదిలేస్తాను...కాని తిరిగి మాత్రం పంపించెయ్యండి...యెక్కడా పారెయ్యరు కదూ...

రమే :-ఎలా పారేస్తాను... నన్నే మిత్రో అనుకుంటున్నావ్... యెవళ్ళో నామీద నీ అభిప్రాయాన్ని పూర్తిగా మార్చేసివుంటారు...

రమ :-(నవ్వి) యింకెవరు చెడగొట్టివుంటారు... బహుశా పిన్నే అయి వుంటుంది. ఆవిడ యిక్కడేంలేదు...మీరు నిర్భయంగా విశ్రాంతి తీసుకోండి. అంతవరకూ నేను యింట్లో పనులు చేసుకుంటా.

(వెళ్ళటానికి లేచి నిలబడుతుంది)

రమే :-యింటివారితో పరిచయం కలగకపోతే...

రమ :-వారితో మీకు చిన్నప్పటినుంచి పరిచయం వుంది. విచారపడకలసిన అవసరం ఏమీలేదు...చిన్నతనంలో మీరు రాణీఅని పిలిచేవారే ఆమెదే యీ యిల్లు...

రమే :-యిది నీ యిల్లా ? యిక్కడ యిల్లెందుకు ?

రమ :-యీ వూరు నాకు బాగుంటుందని చెప్పేనుగా...అందుకని యిక్కడికి తరుచు వస్తూవుంటాను.

రమే :-తారకేశ్వరునిమీద నీకు మహాభక్తి.

రమ :-దీనిని భక్తిఅనరు... కాని బ్రతికున్నంతవరకూ ఏదో ఒకటి చెయ్యాలని వుంటుందిగా. (దాసీ ప్రవేశం)

దాసి :-అమ్మా, వర్షం కురవటం మొదలుపెట్టింది. మనం వెళ్లటానికి వీలుండదు.

రమ :-అయితే యివ్వాళ వెళ్ళవద్దు...వాళ్ళతో రేపు వెడదామనిచెప్పు.

దాసి :-అయితే బ్రతికేం...కానీ యివ్వాళే వెళ్ళవలసినగోజు...యింటిద్గగ వాళ్ళు ఎదురుచూస్తారేమో ?

రమ :-కుముదా! మధ్యమధ్య కొంచెం ఆలోచించటంమంచిది. నువ్వు నడు. నేను వస్తున్నాను. (దాసి నిష్క్రమణ)

రమే :-కేవలం నావల్లనే నువ్వు వెళ్ళడం వీలుపడలేదు.

రమ :-మీవలన కాదు...మీ జబ్బే కారణం...మొగంచూస్తేనే జ్వరంవచ్చేట్లు కన్పిస్తోంది...యీ స్థితిలో వదలి ఎల్లా వెళ్ళను.

రమే :-నేను నీకేం కాను రమా. పైగా, అడ్డంకికూడాను. అయినప్పటికీ స్వంత ఊరిమనిషిగా నీదగ్గర యివ్వాళపొందిన ఆదరం చెప్పతరంకానిది.

రమ :-అయితే చెప్పకండి...రెండురోజుల తర్వాత ఇదిమీరు మరచిపోయినా నేనేం ఫిర్యాదుచేయను.

(రమ తిరిగి వెళ్ళడానికి ప్రయత్నిస్తుంది)

రమే :-దీవిస్తున్నాను రమా, సుఖంగా కలకాలం జీవించు.

రమ :-(వెంటనే తిరిగివచ్చి నిలబడి) రమేశ్, యిప్పుడు నిజంగా మీమీద నాకు కోపం వస్తోంది. నేను హిందూవిధవను...నన్ను దీర్ఘకాలం జీవించమని దీవించటం శాపం యివ్వటమే. మామేలు కోరేవాళ్ళు ఎవ్వరూ యిలాంటి దీవనయివ్వరు. నే వెడుతున్నా.

(తొందరగా నిష్క్రమణ)

# 3

(పల్లెదారి. మూడు జాముల సమయం. జోపన మూడు రోజుల నుంచి వర్షం కురియటంవల్ల చెరువులు, కాలువలు అన్నీ పొంగి పొర్లిపోతుంటాయి. దారిఅంతా బురదగా ఉంటుంది. వర్షం కురవటం ఆగి కొద్దిసేపవుతుంది. చేతిలో గొడుగుకర్ర పుచ్చుకుని వేణీ, గోవిందగంగూలీ ప్రవేశం. రోడ్డుమీద బురద చిహ్నాలు వారి శరీరాలమీద స్పష్టంగా కనబడు తుంటాయి.)

గోవింద :-(లోపలినుంచే కొంచెం గట్టిగా) దీనికింత ఆలోచన ఎందుకంటాను? కట్ట తెగకొట్టి నీళ్ళు పోనియ్యండి. లేకపోతే పొలాలు మునిగిపోతా యని చెప్పటానికి మహాగొప్పవాళ్ళు బయలుదేరారు. పొలాలు మునిగితే మునగనీ... పెదబాబూ... ఈ నీచప్రజాతివాళ్ళ యీ ధైర్యంచూసి నవ్వాలో యేడవాలోకూడా నా కర్థం కావటంలేదు.

వేణీ :-ఆ...చూడు బాబాయ్...ఈ రైతువెధవల ఎకరం భూమి మునిగి పోతుందట!... అందుకని కట్ట తెగకొట్టాలట... నీళ్ళు బయటకు పోనివ్వాలా... ఎదురుగాఉన్న చెరువుకు సాలీనా రెండువందల రూపాయలు పన్నుకట్టాలి. నీళ్ళు తెగకొట్టేస్తే అందులో ఒకచేపన్నా మిగులుతుందా?

గోవింద :-చేపలు యెక్కడుంటాయ్?... నీచజాతి వెధవలు. ఎప్పుడన్నా రెండు రూపాయలు మొగంచూసారా? ..రెండువందల రూపాయల నష్టం అంటే యేమిటో వీళ్ళకు తెలుసా? మనుష్యుల్ని కాపలా పెట్టావ్ గా? లేకపోతే వెధవలు దొంగచాటుగా కట్టతెగకొట్టేస్తారు. పెదబాబూ...ఏంజరుగుతుందో యేమీచెప్పవేం? పీకమీదకు వచ్చిం దనేసరికి యీ వెధవలు యెంతపనైనా చేసేస్తారు.

వేణీ :-దర్వాన్, గోపాలుణ్ణి యిద్దరినీ కాపలాకు పంపించాను. రమ జమిం దారీ ఊరు పీర్ పూరులో ఉంటాడే వస్తాడు, అక్బరుకు, వాడి ఇద్దరి కొడుకుల దగ్గరకికూడా కబురుచేశాను. వాళ్ళు వందమందికైనా సరే జవాబు చెపుతారు.

గోవింద :-మంచిపని చేశావ్...చిలుములో పొగాకు వేసి నిప్పు వేసుకుంటున్నా. నీ నౌకరు వచ్చి పిలిచాడు. 'వర్షంలో తడుస్తూ వచ్చావేంరా హరీ?' అన్నాను. 'పెదబాబుగారు మిమ్మల్ని పిలుచుకు రమ్మన్నా'రన్నాడు. గొడుగు, కర్ర తీసుకుని వెంటనే బయలుదేరి వచ్చేశాను. 'ఈ గాలివానలో యెక్కడికి బయలుదేరుతున్నా'రంది మీ పిన్ని... 'నోరుముయ్య'మన్నాను. మళ్ళీ వెనకనే పిలవటం ప్రారంభించింది. 'పెదబాబు కబురంపాడు తెలుసా...వర్షం ఐతేనేం, గాలివాన ఐతేనేం' అన్నాను.

వేణీ :-బాబాయ్...నీతో సంప్రదించకుండా ఒక్క అడుగుకూడా ముందుకు వెయ్యనని నీకు తెలుసుగా...నా దగ్గర యేడ్చి మొత్తుకున్నా ఏమీ ఫలితం కనబడకపోయేసరికి, ఆ వెధవలు చినబాబు దగ్గరకు విన్నవించుకోవటానికి వెళ్లారు. వాడోక బుర్రలేని గొడ్డు...వాడి దేంపోయింది. మనకు నష్టం కలిగితే కలిగిందిలే... చెరువు కట్ట తెగకొట్టెయ్యండని చెప్పినా చెప్పవచ్చు...

గోవింద :-ఆ...చెపితే, చెప్పవచ్చు... పెదబాబు... ఆ వెధవ యేమైనా అంటాడుకూడా...(కొంచెం నెమ్మదిగా) రమ దగ్గరకు కబురు పంపారుగా? ఆ పిల్ల మనస్సుకూడా ఒక రకంగా స్థిరంగా ఉండదు. బీద బిక్కల యేడుపు చూసి సరే అంటుందేమో...

వేణీ :-లేదు బాబాయ్...ఆ భయం ఏమీలేదు. ప్రొద్దున్నే దానికి నచ్చచెప్పి లొంగదీశాను. నిన్న రాత్రినుంచీ యీ విషయమై, కొంచెం గుసగుసలు వినిపిస్తున్నాయిగా...అరుగో...చూడు...మళ్ళీ కొంతమంది వెధవలు యిటే వస్తున్నారు.

(కొంతమంది రైతుల ప్రవేశం. వాళ్లు పైనుంచి క్రిందవరకు బురదతో నిండి ఉంటారు)

రైతులు :-(ఒకే కంఠంతో) పెదబాబుగారికి దణ్ణాలు...బీదవాళ్ళని రక్షించండి బాబూ...పైరులు కుళ్ళిపోతే పిల్లాజెల్లా ఆకలితో మాడిపోతారు.

గోవింద :-ఏం...సనాతన్...మీరంతా చినబాబు దగ్గరికి పరుగెత్తారుగా... ఆయన్ని రక్షించమనక పోయారా?

సనాతన్ :-గంగూలీబాబూ...వెళ్ళినవారెవరో వెళ్లారు. మేము వీరిపాదాలే ఆశ్రయించుకుని ఉన్నాం...బాబుల కాళ్లే పట్టుకుంటాం.

(వేణీబాబు కాళ్ళమీదపడి యేడ్వటం ప్రారంభిస్తాడు)

రెండవరైతు :-(వేణీబాబు పాదాలమీద పడి) రక్షించినా, చంపినా మీరే బాబూ...మీ పాదాలను మాత్రం వదలము.

వేణి :-(బలవంతంగా తన కాళ్ళను విడిపించుకుని) పొండిరా...పొండి...రెండు వందల రూపాయల పన్ను నష్టపరచుకోలేం...పద బాబాయ్... పోదాం...ఇంకా బోలెడు పనులున్నాయి...

(వేణీ, గోవింద గంగూలీ వెళ్ళటానికి తయారవుతారు)

రైతులు :-పెదబాబూ...గంగూలీగారూ...నిజంగా మమ్మల్ని చంపేస్తారా?

గోవింద :-(తిరిగివచ్చి వ్యంగ్యంగా) చస్తారో బ్రతుకుతారో మాకేం తెలుసు?

(ఇద్దరూ వెళ్ళిపోతారు)

రైతులు :-భగవంతుడా...నిజంగా దీనుల్ని చంపేస్తావా? పైన కూర్చుని అంతా చూస్తూనే ఉన్నావ్? మాకేం దారి చూపెంచవ్?

(అందరి నిష్క్రమణ)

# 4

(రమ యింటి ముందుభాగం, సాయంకాలం. ముందుభాగంలో చండీ మండపపు కొంతభాగం, రెండవవైపున తులసికోట కనబడుతూంటుంది. రమ సంధ్యా దీపంతీసుకుని నెమ్మదిగావచ్చి

తులసికోట దగ్గిర దీపంపెట్టి, మెడలో కొంగువేసుకుని నమస్కారం చేస్తూంటుంది. అదే సమయంలో రమేశ్ నెమ్మదిగావచ్చి వంగివున్న రమ తలముందు నిలబడతాడు)

రమ :-(తలఎత్తి, అకస్మాత్తుగా రమేశ్‌నుచూసి ఆశ్చర్యంతో) ఆ...మీరా... ఎక్కడనుంచి?

రమే :-అవసరమైన పనిమీద వచ్చాను రమా...

రమ :-(కొంచెంగా నవ్వి) ఈ రావటం బాగా లేదండి. ఎవరైనాచూస్తే, ఇంతసేపూ దీపంవెలిగించి మీకు నమస్కారం చేస్తున్నానని అనుకుంటారు. ఇలావచ్చి నిలబడటం మంచిపనేనా?

రమే :-రమా... నేను నీకోసమే వచ్చాను.

రమ :-(నవ్వి) ఇదివారకు తెలుసు. లేకపోతే మీరు పిన్నికోసం వచ్చారని నేనేమన్నా అన్నానా...

(ఈ మాటలే అని రమ దీపంతీసుకునిలేచి నిలబడుతుంది)

రమ :-ఆజ్ఞ ఏమిటో... సెలవియ్యండి...

రమే :-నిజానికి నువ్వు అన్నిసంగతులూ వినేఉంటావ్ ? చెరువునీరు తెగకొట్టే విషయంలో నీ అభిప్రాయం తెలుసుకోవటానికి వచ్చాను.

రమ :-నా అభిప్రాయమా ?

రమే :-ఆ... నీ యభిప్రాయం తెలుసుకోవటానికే యింతదూరం పరుగెత్తుకు వచ్చాను. బీదల యీ కష్టదశలో నువ్వు కాదనవని నాకు బాగా తెలుసు రమా...

రమ :-నీళ్ళు తెగకొట్టేయటం ఉచితమే... కాని రమేశ్... ఇదెలా జరుగుతుంది ? పైగా పెద్దన్నయ్యకు యిష్టంలేదు.

(వేణీ గోవిందగంగూలీల ప్రవేశం)

వేణీ :-నిజమే... నాకు యిష్టంలేదు. ఐనా ఎందుకుండాలి అంటా ? రెండు మూడువందల రూపాయల ఖరీదైన చేపలు నష్టమవుతాయని నీకు తెలుసునా తెలియదా ? ఈ డబ్బు ఆ రైతులేమన్నా యిస్తారా ఏం ?

రమే :-రైతులు బీదవాళ్ళు... ఇంతడబ్బు ఎక్కడనుంచి తెస్తారు ? పెద్దన్నయ్యా, యీ విషయమై కాస్తంత బాగా ఆలోచించిచూడండి.

వేణీ :-ఆలోచించే చూశాను. కాని రమేశ్ యింతడబ్బు నష్టం ఎందుకు పడాలి ? (గోవిందతో) బాబాయ్... చూశావా... మన తమ్ముడు జమీందారీ యిలా చేస్తున్నాడన్నమాట. అరే రమేశ్... ప్రొద్దున్న దాకా వాళ్ళంతా నాదగ్గరేపడి ఏడుస్తున్నారుగా... నాకు అంతా తెలుసు... నీకు దర్వాన్ అంటూ ఎవడూలేడూ ? లేకపోతే వాడి కాళ్ళను చెప్పులజోడు లేదా ? ఇంటికివెళ్ళి ఈ ఏర్పాట్ చేయ్... నీకు దానంతటఅదే పోతుందిలే...

(ఈ మాటలే అని, గోవిందగంగూలీతో సహా హా... హా... హా... అంటూ నవ్వటం ప్రారంభిస్తారు)

రమేశ్ :-పెద్దన్నయ్యా...మనం ముగ్గురం రెండువందల రూపాయల నష్టం కోసం మొగాలుచూసుకుంటే, ఆ రైతులకు సంవత్సరం పొడుగునా తిండిలేకుండా పోతుంది. వాళ్ళకు ఐదారువేలదాకా నష్టం కలుగుతుంది. ఈ విషయం ఆలోచించండి అన్నయ్యా...

వేణీ :-నష్టమొస్తే అవనీ...వాళ్లకు అయిదు వేలు నష్టమవనీ, యాభై వేలవనీ... ఇక్కడ యెంత మొత్తుకున్నా ఐదు పైసలైనాసరే వాళ్ళకు రాలవు. తమ్ముడూ...ఈ వెధవలకోసం రెండేసి వందల రూపాయలు నష్టపోమంటావా ?

రమే :-ఐతే వీళ్లు ఏడాదిపొడుగునా మరి యేంతింటారు ?

వేణీ :-(నవ్వి, తల ఆడిస్తాడు. ఒకసారి ఉమ్మివేసి, స్థిరంగాఉండి) ఏం తింటారా ? నువ్వు చూస్తూంటు... ఈ వెధవలంతా భూమి, ఆస్తి తాకట్టుపెట్టి డబ్బుతీసుకు వెళ్ళటానికి మనదగ్గరకు వస్తారో...లేదో ...తమ్ముడూ...మనస్సు కాస్తంత చల్లపరచుకుని మరిపనిచేసు... మన పెద్దలు యేగడ్డితినో సంపాదించి యీ కాస్త యెంగిలికూడు మనకు వదలిపోయారు. మనంకూడా కష్టపడి, కూడబెట్టుకుని, తింటూ, తినుగుతూ మనపిల్లలకు అప్పగించాలి— వాళ్లు యేం తింటారా ? ఏదో అప్పుచేసుకుని తింటారు...కాకపోతే వీళ్లని నీచపుజాతివాళ్లని ఎందుకంటారంటావ్ ?

గోవింద :-బాబూ...ఇవి ఋషీశ్వరులు, మహాత్ములు చెప్పిన విషయం... శాస్త్రాలుకూడా ఇదేచెపుతున్నాయి...ఇదేం నీమాటా నామాటా కాదు.

రమే :-ఏమీ చెయ్యకూడదని మీరు నిశ్చయం చేసుకున్నపుడు, మీతో వాదించటంకూడా వ్యర్థమే పెద్దన్నయ్యా...

వేణీ :-కాదు... అదేంకాదు... (రమతో) రమా... నీ జమీందారీ గ్రామం పీరుపురపు అక్బరుఆలీ అతని కొడుకులకోసం కబురంపాను. (గోవింద గంగూలీతో) నడు బాబాయ్...మనం అక్కడికికూడా వెళ్లి యేం జరుగుతుందో చూసివద్దాం... చీకటిపడుతోంది...

గోవింద :-నడు...పోదాం... (ఇద్దరి నిష్క్రమణ)

రమే :-రమా... నీ అంగీకారం యియ్యి... కేవలం ఆయన ఒప్పుకోకుండా మాత్రాన యింతటి అన్యాయంచేయుటం మంచిదేనా...? ఇప్పుడే వెళ్లి కట్ట తెగకొట్టేస్తాను......

రమ :-కాని చేపలుపోకుండా ఏం ఏర్పాటుచేస్తారు ?

రమే :-నీరుచాలా ఎక్కువగాఉంది. అందువల్ల చేపలు బయటికిపోకుండా కట్టడియేమీ చెయ్యలేం. ఈ నష్టాన్ని మనం భరించవలసే ఉంటుంది. లేకపోతే ఊరుఊరంతా నాశనమయిపోతుంది.

(రమ మాట్లాడదు)

రమే :-ఐతే మరినువ్వు దీనికి అంగీకరించినట్లేనా ?

రమ :-ఊహు...ఇన్నిరూపాయల నష్టాన్ని నేను భరాయించలేను. అదీ కాకుండా యీ ఆస్తిఅంతా నా తమ్ముడిది. నేను ఒక ధర్మకర్తను మాత్రమే...

రమే :-అదేంకాదు...నాకు అంతా తెలుసు...దీనిలో సగంఆస్థి నీది...

రమ :-ఊరికే పేరుకుమాత్రం...ఆస్థి అంతా యతీంద్రుడికే వస్తుందని నాన్న గారికి బాగా తెలుసు. అందుకనే సగంఆస్తి నా పేరునకూడా వ్రాసారు.

రమే :-(వినయపూర్వకంగా) రమా...ఈ డబ్బు ఏమంత ఎక్కువని ? అదీ కాకుండా నీస్థితైనా అందరికంటె బాగాఉంది. ఇంతమంది పేదల్ని యీ చిన్న విషయంకోసం ఆకలితో చంపవద్దని ప్రార్థిస్తున్నా...నువ్వు యింతటి కఠినాత్మురాలివవుతావని నేనెన్నడూ స్వప్నంలోకూడా అనుకోలేదు.

రమ :-నేను నష్టపడనంతమాత్రాన కఠినాత్మురాలినయేటట్లయితే...పోనీ... కఠినాత్మురాలినే ననుకోండి...ఒకవేళ మీకంత దయవుంటే యీ కష్టాన్ని మీరే ఆదుకోరాదూ... ?

రమే ;-రమా...డబ్బుదగ్గరనే మానవుడిగుణం తెలుస్తుంది. ఇక్కడ కపటం అంటూ ఉండదు. మానవుడి నిజస్వరూపం యిక్కడనే బయటపడుతుంది. కాని నువ్వు యిలాంటిదానివని నేనెన్నడూ అనుకోలేదు. ఇవ్వాళ నీనిజరూపం బయటపడింది. నువ్వు వీరిందరికంటె ఉన్నతాశయాలు గలదానివనీ, గొప్పదానివనీ అనుకున్నాను. కాని నువ్వేమీ అటువంటిదానివి కాదు. నిన్ను కఠినాత్మురాలనటంకూడా పొరపాటే...వట్టి నీచురాలివి...హీనురాలివికూడాను...

రమ :-ఏమంటున్నారు ? నేనెవర్ని ?

రమే :-నీచురాలివి...హీనురాలవు...ఇప్పుడు నేనెంత విచారపడుతున్నానో నీకు బాగా తెలుసు. అందుకనే పేదలతిండిఖర్చు యీ సమయంలో నా

దగ్గర వసూలుచేయాలనుకున్నావ్... ఈ మాట పెద్దన్నయ్యకూడా అనలేకపోయారు. మొగవాడైనప్పటికీ ఆయన నోటివెంటరానిమాట... ఆడదానివైనా నీ నోటివెంబడి సునాయాసంగా వచ్చింది... కాని రమా... ఇవ్వాళ నేనొకమాట చెపుతున్నా... ఇంతకంటె అధికమైన ఆపదనుకూడా ఆదుకోగలను... కాని ప్రపంచంలోని పాపాలన్నింటికంటె ఎక్కువపాపం మానవుడి దయాస్వభావంపై దాడిచెయ్యటం... ఇవ్వాళ నువ్వు యీ దుర్మార్గానికి ఒడిగట్టే...నాదగ్గర డబ్బువసూలు చేయటానికి ఎత్తు ఎత్తావ్...

(రమ నిరుత్తరురాలై కదలకుండా చూస్తూంటుంది)

రమే :-నాలో బలహీనత యెక్కడుందో మీరంతా బాగానే గుర్తించారు. కాని అక్కడ పిండటంవల్ల మీకు యివ్వాళ ఒకచుక్క రసమైనా నసకే రాదు. నేను యేం చెయ్యదలచుకున్నదీకూడా నీకు చెప్పి వెడతాను. ఇప్పుడేవెళ్ళి దౌర్జన్యంగా చెరువుకట్ట తెగకొట్టేస్తా...నన్ను మీరు ఆపదలచుకుంటే, ఆపి చూడండి. తెలుస్తుంది...మీ సత్తా...

(రమేశ్ వెళ్ళిపోతూంటాడు...రమ అతన్ని పిలుస్తుంది)

రమ :-ఈమాటవిని వెళ్లండి...నాయింట్లో నన్నవమానించినదానికి నేనేమీ అనను. కాని యీ పని మాత్రం చేయకండి...

రమే :-ఎందుకని ?

రమ :-ఎందుకనా ? ఇంతగా అవమానించినప్పటికీకూడా మీతో పోట్లాడటం నాకు యిష్టంలేదు కనుక...అదీకాకుండా...

రమే :-అదీకాకుండా...

రమ :-అక్కడికి అక్బర్ సర్దార్ ముఠా బహుశా వచ్చిందేమో...

రమే :-నీ అక్బర్ సర్దార్ ముఠాలో యెవరున్నారో, నాకు తెలియదు... తెలుసుకో దలచుకోలేదు కూడా...కొట్లాడటం నాకు యిష్టం కాదు...కాని యిప్పుడు, నీ సద్భావానికి నాదగ్గరేం విలువలేదు...

(తొందరగా వెళ్ళిపోతాడు)

(పినతల్లి ప్రవేశం)

పినతల్లి :-ఇక్కడ యెవరే గట్టిగా కేకలువేస్తున్నారు రమా ? మాటతీరు కొంచెం గుర్తుపట్టగలిగేట్టుగా ఉంది.

రమ :-ఎవరూలేరు.

పిన్‌తల్లి :-ఐతే యెవరూ మాట్లాడందే నాకు వినబడిందంటావా? సంధ్యా దీపంవెలిగించి పూజకు కూర్చున్నాను. ఏదో ఆంబోతు రంకెవేస్తున్నట్టుగా అనిపించింది. పూజవదలి రావలసివచ్చింది.

రమ :-ఆయన వెళ్ళిపోయాడులే...నువ్వువెళ్ళి పూజచేసుకో... (తెరవైపు చూసి) కుముదా...

( దాసీ ప్రవేశం )

కుముద :-ఏం, అమ్మా?

రమ :-నేను పెద్దమ్మదగ్గరకి వెళ్ళాలి...నాతో రా...

పిన్‌తల్లి :-ఇప్పుడెందుకే అక్కడికి?

రమ :-ఇదిగో పిన్నీ...అన్నివిషయాలు నీకు తెలియవలసిన అవసరంలేదు... పద కుముదా...

కుముద :-పదమ్మా .. (ఇద్దరి నిష్క్రమణ)

పిన్‌తల్లి :-అర్...బాప్ రే...చావకొట్టేట్లుంది. లోకులు తారకేశ్వరపు విషయం వినకపోతే...పైగా నేను దీనికోసమే అందరితో పోట్లాడి చస్తున్నాను. (నిష్క్రమణ)

(వేణి, గోవిందగంగూలీ, దెబ్బలుతిన్న అక్బర్ అతని యిద్దరు కొడుకులు గొహర్, ఉస్మాన్‌ల ప్రవేశం)

అక్బర్ :-(చిన్నగుంజసాయంతో కూర్చుంటాడు...మొగంఅంతా నెత్తురుతో తడిసిపోయి ఉంటుంది) అల్లాహ్...

గొహర్ :-(తలమీద నెత్తురు చేతితో తుడుచుకుని) ఏం నాన్నా...బాధ ఎక్కువగా ఉందా?

అక్బర్ :-అల్లాహ్...

వేణీ :-నామాట విను అక్బర్...పోలీసుస్టేషనుకి పదు...వాడికి ఏడేళ్ళు శిక్ష వేయించకపోతే నేను ఘోషాల్ వంశంలో పుట్టనేలేదన్నమాట.

(రమ వస్తుంది)

రమ :-ఆ...మిమ్మల్ని యిలా ఎవరుకొట్టారు అక్బర్? (దగ్గరగా కూర్చుంటుంది)

అక్బర్ :-(ఆకాశంవైపు చేతతో చూపించి)...అల్లాహ్.

వేణి :-అల్లా...అల్లా...ఇక్కడ కూర్చుని "అల్లా...అల్లా..." అంటే యేం ప్రయోజనం ? నేను చెప్పుతున్నాగా...పోలీసుస్టేషనుకు నడు. దీనికి ప్రతీకారంగా వాడిని పదేళ్లపాటు జైలుకుపంపించకపోతే..రమా... నువ్వు మాట్లాడకుండా ఊరుకుంటావేం ? నాతో పోలీసుస్టేషనుకు రమ్మని వీళ్ళతో చెప్పు...

రమ :-అక్బర్ ! మిమ్మల్ని యిలా ఎవరుకొట్టారు ?

అక్బర్ :-చినబాబమ్మా...

రమ :-ఇది ఎన్నడైనా జరిగే సంగతేనా అక్బర్...ఒంటరిగా చినబాబు మీ తండ్రీ కొడుకుల్ని ముగ్గురినీ గాయపరచారా ? ఈ పని మూడువందల మంది కలిసైనా చేయలేరే...

అక్బర్ :-అదే జరిగిందమ్మా...మబాన్ బాబూ...నిజంగా నువ్వు నీ తల్లిపాలే త్రాగావ్...సాముచేయటం అంటే సరిగా దీన్నే అంటారు.

గోవింద :-ఈ మాటే పోలీసుస్టేషనులో చెప్పమంటున్నా...నువ్వు యెవరి లాఠీదెబ్బతో గాయపడ్డావో అదేచెప్పు...చినబాబు లాఠీతోనా... ఆ వెధవ భజువాగాడిదానితోనా ?

అక్బర్ :-ఆ పొట్టి హిందూస్థానీవాడి లాఠీతోనా ? వాడికి లాఠీత్రిప్పటం ఏం తెలుసు ? ఏం రా గౌహర్...నీ మొదటి దెబ్బకే వాడు కూలబడ్డాడు కదూ... ?

(గౌహరు నోటితో యేమీచెప్పడు కాని తల ఊగిస్తాడు అవునన్నట్లుగా.)

అక్బర్ :-నా చేతి దెబ్బతగిలితే వాడు బ్రతికేవాడే కాదు. గౌహరు లాఠీ దెబ్బతోనే వాడు 'బాప్ రే' అని కూలబడ్డాడు...అమ్మా... !

(గౌహరు మళ్ళీ తల ఆడిస్తాడు)

అక్బర్ :-అమ్మా...! తరువాత చినబాబు వాడిచేతిలో లాఠీతీసుకుని కట్టమీద నిలబడేసరికి, తండ్రీ-కొడుకులం మేం ముగ్గురంకూడా ఆయన్ని అక్కడి నుంచి కదిలేట్లు చేయలేకపోయాం. చీకట్లో ఆయనకళ్లు పెద్దపులికళ్ళలా మెరవటం ప్రారంభించాయ్. ఆయన–"అక్బర్ ! నువ్వు ముసలివాడివి. పక్కకు తప్పుకో...కట్ట తెగకొట్టకపోతే ఊళ్లో జనంఅంతా ఆకలితో

చచ్చిపోతారు. అందువల్ల దీనిని తెగకొట్టేయాలి. ఆఖరుకు నువ్వూ వ్యవసాయం చేసేవాడివిగా...నీకూ నీ ఊళ్లో పొలంవుంది. అదంతా నష్టమైపోతుంటే నీ కెలా ఉంటుందో ఆలోచించు" అన్నారు... సలాంచేసి "చినబాబు... అల్లామీద ఒట్టు...మీరు తప్పుకోండి... అమ్మగారు మమ్మల్ని పంపించారు. ప్రాణం వదలుతామని చెప్పి వచ్చాం" అన్నాను. 'రమ మిమ్మల్ని పంపించిందా...? నన్ను కొట్ట టానికేనా?' అన్నారమ్మా ఉలిక్కిపడుతూ... నేను "చినబాబూ! కట్ట తెగకొట్టటం మానివేసి, యింటికి వెళ్ళిపొండి. మీ చాటున నిల బడి యీ నాటకం ఆడుతున్నవాళ్ళ తలలు పగలుకొట్టి పోతాను" అన్నాను.

వేణి :-కృతఘ్నపు వెధవా... అక్కడ సలాంలుచేసి యిక్కడ డప్పాలు కొడుతున్నావా...

(అక్బరు, అతని యిద్దరు కొడుకులు జవాబుగా చేతులు పైకి యెత్తుతారు.)

అక్బర్ :-ఖబడ్దార్ పెదబాబూ...కృతఘ్నులమని అనకండి. మేం ముసల్మాను బిడ్డలం...ఏదైనా సహిస్తాంకాని యీ మాటఅంటే వూరుకోం...... (చేత్తో మొగంమీది నెత్తురు తుడుచుకుని) మేము కృతఘ్నుల మంటు న్నారు...చూడమ్మా!... ఇంట్లో కూర్చుని అంటున్నారా పెద బాబూ...? మీ కళ్ళతో చూస్తే తెలిసేది...చినబాబు యెలాంటి వారో......

వేణి :-(మొగం చిట్లించి) చినబాబు యెలాంటివాడా? ఇదే పోలీసుస్టేషనుకు వెళ్ళి యెందుకు చెప్పవ్? కట్టమీద కాపలా కాస్తున్నాం...ఇంతలో చినబాబు కట్టమీదకువచ్చి మమ్మల్ని కొట్టారని చెప్పు...

అక్బర్ :-(నాలిక కరచుకుని) ఛీ...ఛీ...రాత్రిని పగలని చెప్పమంటారా పెదబాబూ...

వేణి :-ఇలాకాకపోతే మరొకవిధంగా యేమైనా చెప్పు...ఈ రాత్రికి మాత్రం స్టేషనుకువెళ్ళి దెబ్బలు చూపించిరా...రేపటికల్లా వారంటు తీసుకు వచ్చి జైలులో పడవేయిస్తా—రమా నువ్వుకూడా వీళ్ళకి కొంచెం నచ్చచెప్పు...మళ్ళీ యిలాంటి అవకాశం దొరకదు...

(రమ మాట్లాడదు. అక్బర్ మొగంవైపు చూస్తూంటుంది)

అక్బర్ :-(తల ఆడించి) కాదమ్మా...ఇది నావల్ల కాదు.

వేణి :-(నిటారుగా లేచి) ఎందుకని ?...ఎందుకు అవదంట...

అక్బర్ :-(కోపంగా) ఏమంటున్నారు పెదబాబూ...నాకేం సిగ్గూ శరం లేవనుకున్నారా ? ఈ నాలుగు ఊళ్ళజనం నన్ను సర్దార్ అని పిలవ టంలా ? అమ్మా...తమరు ఆజ్ఞాపిస్తే అపరాధిగా నేను జైలుకుకూడా వెడతాను. కాని ఫిర్యాదుచేయటానికి ఏ మొగం పెట్టుకుని వెళ్ళనమ్మా?

రమ :-అక్బర్...నిజంగా నువ్వు స్టేషనుకు వెళ్ళలేవా ?

అక్బర్ :-వెళ్ళలేనమ్మా...ఏపనైనా చేస్తాను కాని...పోలీసుస్టేషనుకి వెళ్ళి దెబ్బలుమాత్రం చూపించలేను. లే...గౌహర్...ఇంటికి పోదాం... ఫిర్యాదు, గిర్యాదు మనమేం చెయ్యలేంలే...

(ముగ్గురూలేచి వెళ్లటానికి తయారవుతారు)

గోవింద:-పెదబాబూ...నిజంగా నే వెళ్లిపోతున్నారు. ఐతే ఏంజరగనున్నేగా...

వేణీ :-రమా...వీళ్లని ఆపుచెయ్యవ్ ? ఈ అవకాశం చేతినుంచి జారవిడిచామా ...మళ్లీ దొరకదు...

(రమ మాట్లాడకుండా తలవంచుకుంటుంది. అక్బర్, అతని ఇద్దరు కొడుకులు లాఠీలు సాయంగా, బయటకు వెళ్లిపోతారు)

వేణీ :-ఊ...ఇప్పటికి నాకు అంతా తెలిసింది...

గోవింద :-విన్నదంతా అబద్ధం కాదన్నమాట...

(ఇద్దరూ తొందరగా వెళ్లిపోతారు)

రమ :-రమేశ్, నీలోయింత శక్తిఉందని, యిలా చేయగలవని, నేను కలలో కూడా అనుకోలేదు...



# ౫

[ఊరిలో ఒకభాగం. అక్కడక్కడా పాడుపడిన దేవాలయపు చిహ్నాలు కనబడుతుంటాయ్...ఆ ప్రదేశం అంతా చెట్లు, చేమలతో నిండివుంటుంది. సామాన్యంగా యీవైపు ఎవ్వరూ రానట్టుగా తోస్తుంది]

(వేణీ, గోవిందగంగూలీల ప్రవేశం)

గోవింద :-(జాగ్రత్తగా, నాలుగువైపులాచూసి) ఏ వెధవా యిక్కడదాక్కుని వినటంలేదుగదా...బాబూ...పన్నాగం అంతా పన్ని, త్రాడు చేతిలో పుచ్చుకుని కూర్చున్నా...కాస్త లాగితేచాలు అంతా ధన్‌మని పడిపోతుంది.

వేణీ :-పనిఅంతా అయిపోయినట్లేగా ?

గోవింద :-కాకపోతే...నిన్ను యీ అడవిలోకి ఊరికే తీసుకువచ్చా ననుకున్నావా ?...అరే...గాడిదా...భైరవాచారి...నీ దగ్గర దమ్మిడీశక్తి లేదు...మాకు వ్యతిరేకంగా నడుస్తావా ? ఇంకొకళ్ళని రక్షించటానికి బయలుదేరావ్ ? ముందు నీ తాతముత్తాతల పొలం కాపాడుకో...నీ కూతురుపెళ్ళి ఎలాచేస్తావో... నేనూ చూస్తాగా...

వేణీ :-ఐతే డిక్రీ అయిపోయిందా ?

గోవింద :-(రెండుచేతులవేళ్ళు పైకిఎత్తి) వెయ్యికి...కాని బాబూ ఇప్పుడు వట్టిమాటలతో పనిజరగదు. సగంసగం జరుగుతుంది.

వేణీ :-(సంతోషంతో) బాబాయ్...సగం ఏ ఖర్మం...పదహారణాలు...

గోవింద :-షబాస్ బాబూ...కలకాలం జీవించు...ఇదే కాదు. దుర్గపూజ దగ్గరకు వస్తోంది. ఈసారి చూస్తువుగాని...యదుముఖర్జీ కూతురు ఇక్కడ దుర్గాప్రతిష్ఠాపన ఎలా చెయ్యగలుగుతుందో...వచ్చే ఫాల్గుణ మాసంలో తనతమ్ముడి ఉపనయనంకూడా ఎలాచేస్తుందో యిక్కడి జనానికందరికీకూడా చూపించుతా...అప్పుడే నన్ను గోవిందగంగూలీ అని పిలుద్దువుగాని...

వేణీ :-ఐతే తారకేశ్వరం విషయం నిజమేనంటావా ?

గోవింద :-నిజంకాదూ ? ఆ నౌకరు వెధవ ఏమన్నా ఒకపట్టాన చెప్పేవాడేనా?

లంచమయిస్తానని, బుజ్జగించి, లాలించి, బయటకు లాగాలనిచూశాను. కాని ఒకటికాకపోతే, రెండవదైనా లాభించలేదు. పెదబాబూ... అప్పుడు నా కాలిధూళి వాడినెత్తినవుంచి అన్నానుకదా "అరే... నువ్వు రమ నౌకరువైనా, మరేమైనా, శూద్రుడవే...అదికాక నువ్వు మగాకటి కాలేవు...పిల్లలుగలవాడివి. బ్రాహ్మడి పాదధూళి నీ నెత్తిన ఉంది. అబద్ధం చెప్పావా యీ రాత్రి గడవదు...ఈలోగానే నిన్ను పాము కాటువేస్తుంది..."

వేణీ :-అప్పుడు ?

గోవింద :-వెధవకి యేడుపు మొగం పట్టింది. అప్పుడు ధైర్యం చెప్పి "ఒరేయ్! నీవు యీ నౌకరీపోతే, యిలాంటివి మరెన్నో దొరుకుతాయి. కాని ప్రాణం పోయిందా మళ్ళీ తిరిగిరాదు" అన్నా. అప్పుడు మొదటి నుంచి చివరివరకు జరిగిందంతా చెప్పాడు. సాయంకాలం ఆరుగంటల బండికి యాజమానురాలు యింటికి తిరిగి రాలేకపోయిందట. చినబాబు రాత్రిఅంతా అక్కడే ఉన్నాడట! భోజనం... వేళాకోళాలు... అన్నీ జరిగాయట...! పోనిద్దూ...ఇంకొకళ్ళ విషయం మనకెందుకు? కాని ఆ సంఘటన సరిగా సరిపోయింది.

వేణి :-నూశావుగా బాబాయ్...అ రోజున అక్కరుని యేవిధంగాను పోలీసు స్టేషనుకు వెళ్ళనిచ్చిందికాదు.

గోవింద :-ఎలా వెళ్లనిస్తుంది...? అరే బాబూ... అసలు వెళ్ళనివ్వవచ్చా అంటా ?

వేణీ :-ఊ... చీకటిపడుతోంది... పోదాంపద...

గోవింద :-పద... (వెంటనే వేణీ చెయ్యిపట్టుకుని) ఇదిగో బాబూ...! నేను ముందే చెపుతున్నా... అన్నకొడుకు సగం ఆస్తి తీసుకుపోవటానికి వీలులేదు. ఈ విషయంలో జాగ్రతగా ఉండాలి.

వేణీ :-బాబాయ్ !... నువ్వు నిశ్చింతగా ఉండు. నేను బ్రతికుండగా అలా యెన్నటికీ జరగనియ్యను.

గోవింద :-ఈసారి రమకు సంతబజారులో సగరభాగం వదలటానికి వీలులేదు. చెపుతున్నా పెదబాబూ... కాని యీ విషయాలన్నీ దాచిఉంచాలి. ఒకసారిగా బయటపెట్టకు...

వేణీ :-(కొంచెంగా నవ్వి) చూద్దాం... . (ఇద్దరి నిష్క్రమణ)

# 6

(రమేశ్ యింటిలోపలిభాగం. రాత్రి బాగా గడిచిపోయినప్పటికీ, పడకగదిలో కూర్చుని రమేశ్ చదువుకుంటూ ఉంటాడు. అకస్మాత్తుగా లోపలనుంచి యెవరో యేడుస్తున్నట్లుగా వినబడుతుంది. కొద్దిసేపట్లో గోపాల్ గుమాస్తామెడ కావలించుకుని, భైరవఆచార్య బిగ్గరగా యేడుస్తూ ప్రవేశిస్తాడు. రమేశ్ గాబరాగా లేచి నిలబడతాడు.)

భైరవ :-(ఏడుస్తూ) చినబాబూ... నన్ను సర్వనాశనం చేసేశారు.

రమే :-గుమాస్తాగారూ... ఏం జరిగింది ?

గోపాల్ :-బాబూ...పని పూర్తిచేసుకుని ఇంటికి వెడదామనుకుంటున్నా... ఇంతలో ఆచార్యులుగారు యెక్కడినుంచి వచ్చారో... నా మెడ గట్టిగాపట్టుకున్నారు. ఇప్పుడు మెడ వదలటంలేదు...ఏడుపూ మానటంలేదు.

రమే :-ఏం జరిగిందేమిటి ఆచార్యులుగారూ ?

భైరవ్ :-బాబూ...నేను సర్వనాశనమైపోయాను. పిల్లాజెల్లతో ఏ చెట్లో చూసుకోవాలి.

రమే :-ఎందుకని ? ఇల్లేమయింది ?

భైరవ్ :-ఇక యిల్లెక్కడుంది ? వేలం అయిపోయింది.

రమే :-ప్రొద్దున్న వరకు ఉందిగా...ఇంతలో ఎవరు వేలంవేశారు ?

భైరవ్ :-గోవిందగంగూలీ పినమామ ఎవరో సనత్ ముఖర్జీట...ఆయన వేలం వేయించాడు. (బిగ్గరగా ఏడ్వటం ప్రారంభిస్తాడు)

గోపాల్ :-అరే...నా మెడ వదలండి. ఎవళ్ళుచేశారు ? ఎందుకుచేశారు ? బాబుగారితో విపులంగా చెప్పండి. ఊరికే నన్ను యిలా పట్టుకు కూర్చుంటే, ఏం లాభం...వదలండి.

భైరవ్ :-(మెడవదిలిపెట్టి) పదిహేడువందల రూపాయల ఐదణాల ఆరుపైసలు బాబూ డబ్బుపోయింది. ప్రాణంపోయింది.

గోపాల్ :-అప్పు తీసుకువచ్చారా ?

భైరవ్ :-లేదు గుమాస్తాగారూ...ఒక్క పైసాకూడా తీసుకురాలేదు. అంతా అబద్ధం...దస్తావేజు అంతాకూడా ఒకకుట్ర...దావా ఎప్పుడు వేసింది, సమనులు ఎప్పుడు జారీచేసింది, డిక్రీ అయి వేలం ఎప్పుడు అయిందీ కూడా నాకు తెలియదు. నిన్న వీళ్లూవాళ్లూ గుసగుసలాడటం విని, కోర్టుకువెళ్ళి విచారించాను. ఇక పిల్లలతో చెట్టుక్రింద బ్రతికవలసిందే... పదిహేడు వందలరూపాయల ఐదణాల ఆరుపైసలు—

రమే :-ఇలాంటి వింత ఎన్నడూ వినలేదు....

గోపాల్ :-బాబూ...పల్లెటూళ్ళలో సామాన్యంగా, యిలా జరుగుతూనే ఉంటాయి...బీదవాళ్లమీద, ఏ భాగ్యవంతులకైనా కోపంవస్తే, వాళ్లు యిలాగే సర్వనాశనం చేస్తారు. ఇదంతా వేణీబాబు, గంగూలీల పని. ఆచార్యులుగారు మొదటినుంచీ మనతరఫున ఉన్నారుకదూ ..అందు కని యీ ఆపద వచ్చిపడింది.

భైరవ్ :-అవును చినబాబూ...ఇదే జరిగినసంగతి. అందుకనే నాకు యీ యీ ఆపదవచ్చింది.

రమే :-మరి దీనికి ఉపాయం ?

గోపాల్ :-దీనికి బోలెడు డబ్బు ఖర్చవుతుంది. ఈ అప్పు, ఋజువు, సాక్ష్యం అన్నీ అబద్ధాలే. ఈయనపేరుతో యెవరో సమనులు అందుకున్నట్టు న్నారు. కోర్టుకుకూడా వెళ్ళి అప్పుతీసుకున్నట్టుగాచెప్పి కూడా ఉంటాడు. కోర్టుకు వెళ్ళి అన్నిసంగతులూ తెలుసుకుంటేనేగాని యేమీ చెయ్యాటానికి వీలులేదు.

రమే :-ఐతే మీరు కోర్టుకు వెళ్ళిరండి. అన్ని విషయాలు తెలుసుకుని యెంత డబ్బు ఖర్చయినాసరే...దీనికి ప్రతీకారం చేయండి. ఈవిధంగా యిక ముందు ఎవరికీకూడా యిలాంటి అన్యాయం చేయకుండా ఉండేట్లుగా బుద్ధిచెప్పాలి.

భైరవ్ :-(అకస్మాత్తుగా రమేశ్ పాదాలపై పడి) నువ్వు చిరంజీవివవు నాయనా...లక్ష్మీసంపన్నుడవైన రాజువు...భగవంతుడు నిన్ను...

రమే :-(కాళ్ళు వదిలించుకుని) ఆచార్యులుగారూ...మీరు యింటికివెళ్ళండి ఏంచెయ్యాలో అది నేనే తప్పకుండా చేస్తాను.

భైరవ్ :-భగవంతుడు మిమ్మల్ని—

రమే :-రాత్రి బాగా అయిపోయింది. ఇవ్వాళ నాకూ అలసటగా ఉంది కూడాను.

భైరవ్ :-భగవంతుడు మీకు పూర్ణాయువు ప్రసాదిస్తాడు. మిమ్మల్ని మహారాజును చేస్తాడు. (నిష్క్రమణ)

రమే :-(నిట్టూర్చి) గుమాస్తాజీ!...ఇదే మన అహంకారం. మన సంపద... ఇదే మనదేశపు స్వచ్ఛ, శాంత, న్యాయపరత్వ గ్రామీణసమాజం ...

గోపాల్ :-అవును బాబూ...ఇదే...ఈ పనిచేసింది వేణీబాబని ప్రజలందరికీ తెలుసు...అంతా లోలోపల గుసగుసలాడుకుంటారు. కాని ఎవ్వరూ కూడా బహిరంగంగా యీ దుర్మార్గాన్ని యెదుర్కోరు. అప్పుడొకసారి గంగూలీ తన విధవ వదినెగారిని చేయిచేసుకుని యింట్లోనుంచి బయటకు గెంటేశాడు. వేణీబాబు అతనికి మద్దత్తుకనుక నే అంతా కిక్కురుమనకుండా ఊరుకున్నారు. ఆవిడ యేడ్చి, మొత్తుకుని అందరితో చెప్పుకుంది. అంతాకూడా "మేమేం చేస్తాం... దేవుడికి మొర పెట్టుకో...ఆయనే న్యాయం చేస్తా" డన్నారు.

రమే :-తరువాత ?

గోపాల్ :-తరువాత యింకేముంది? ఆ గంగూలీయే యిప్పుడు ప్రజల్ని కులంలోనుంచి వెలివేస్తూంటాడు. ఈ నిర్జీవమైన పల్లెసమాజానికి దీని విషయంలో యేమైన చెప్పేందుకు సాహసంలేదు కాని నా చిన్న తనంలో పరిస్థితులు యిట్లా ఉండేవికావు. వదినగారిమీద చేయిచేసుకున్న వ్యక్తికి సులభంగా విముక్తిఅంటూ ఉండేదికాదు. ఆ రోజుల్లో సంఘం శిక్షించేది. అపరాధి దానిని తలవంచుకుని స్వీకరించవలసివచ్చేది కూడాను.

రమే :-ఐతే యిప్పుడు పల్లెసమాజం అంటూ యేమీ మిగిలిలేదా ?

గోపాల్ :-ఉన్నదేదో, దానిని మీరు ఇక్కడికి వచ్చినప్పటినుంచి చూస్తూనే ఉన్నారు. కష్టదశలో ఉన్నవారిని రక్షించనివారిని, వారిని మరింతగా కష్టపెట్టేవారిని మనం 'సంఘం' అని పిలుస్తూ మహాపాపం చేస్తున్నాం. అది మనల్ని సరాసరి పాతాళానికే తీసుకుపోతుంది.

రమే :-(ఆశ్చర్యంతో) గుమాస్తాజీ!... ... ఈ సంగతులన్నీ మీకెలా తెలిసాయి...?

గోపాల్ :-స్వర్గీయులైన తమ తండ్రిగారివల్ల... ఇవ్వాళ మీరు భైరవాచార్యులను రక్షించాలనుకున్నారు. ఈ శక్తి మీకు యెక్కడినుంచి వచ్చింది ? ఇది వారిదయే...చినబాబు! యీ విధంగా పేదల్ని ఆపదలో ఉన్నవారిని వారు రక్షిస్తూండగా నేను ఎన్నోసార్లు చూశాను.

రమే :-(రెండుచేతులతో మొగం కప్పుకొని) నాన్నా...

గోపాల్ :-చినబాబూ...రాత్రి చాలాగడిచిపోయింది...ఇక విశ్రాంతి తీసుకోండి.

రమే :-ఆ...ఇకపోయి పడుకుంటా. మీరూ యింటికివెళ్ళండి.

(గోపాల్ వెళ్లిపోతాడు. రమేశ్ నిద్రపోదామనుకుంటూంటాడు. కాని అకస్మాత్తుగా గుమ్మందగ్గర ఎవరినోచూసి ఉలిక్కిపడతాడు)

రమే :-ఎవరు ? ఎవరక్కడ నిలబడింది ?

(యతీంద్రుడు గుమ్మంలోనుంచి తొంగిచూస్తాడు)

యతీంద్రుడు :-చిన్నన్నయ్యా... నేను.

రమే :-(దగ్గరకువెళ్లి) ఎవరు...యతీంద్రా ? ఇంతరాత్రా ? నాతోపనుందా?

యతీం :-ఆ...మీతోనే...

రమే :-నన్ను చిన్నన్నయ్యా అని పిలవమని నీకెవరు చెప్పారు ?

యతీం :-అక్కయ్య...

రమే :-రమా ? నాతో యేమన్నా చెప్పమని నిన్ను పంపిందా ?

యతీం :-ఊహు...అక్కయ్య తనని యిక్కడకు తీసుకువెళ్ళమంది. ఇక్కడే ఉంది... (గుమ్మం బయటకు తొంగిచూస్తాడు)

రమే :-(గాబరాపడి...ముందుకువచ్చి) ఇవ్వాళ నా అదృష్టం. కాని నన్ను పిలిపిస్తే పోయేదిగా...ఇంత రాత్రపుడు నువ్వే స్వయంగా ఎందుకు వచ్చావ్ ? రా...లోపలికి రా...

(రమ సంకోచిస్తూ లోపలికివస్తుంది. గుమ్మందగ్గరనే నేలమీద కూర్చుంటుంది. యతీంద్ర అక్కయ్య దగ్గరకూర్చోబోతాడు. కాని రమేశ్ ఒక పడకకుర్చీలాగి వాడిని దానిమీద పడుకోబెడతాడు)

రమ :-రాత్రి యింకా ఎంతోలేదు...త్వరలోనే తెల్లవారుతుంది. మిమ్మల్ని ఒకటి యాచించటానికి వచ్చాను. ఇస్తారా ?

రమే :-నన్ను యాచించటానికి వచ్చావా? ఆశ్చర్యంగా ఉందే...ఏం కావాలో చెప్పు?

రమ :-(తలపైకెత్తి రమేశ్ వైపు కొంచెంసేపు నిశ్చలంగాచూసి) ముందుమీరు మాట యివ్వండి.

రమే :-ఇవ్వలేను...అడగకుండా మాటయిచ్చే నాశక్తిని నువ్వే స్వయంగా నాశనం చేసావ్?

రమ :-నేను నాశనంచేశానా?

రమే :-ఆ...నువ్వే...నీకు తప్ప యీ శక్తి, ప్రపంచంలో మరెవ్వరికీ లేదు. ఇవాళ నీతో నిజంచెపుతున్నా రమా...యిష్టంఉంటే నమ్ము...లేకపోతే మానెయ్యి...ఈ శక్తి నాశనం అవకుండా ఉండినట్లయితే యీ విషయం నీకు యెన్నటికీ తెలిసేదికాదేమో...కాని యివ్వాళ దీనివల్ల మనిద్దరిలో యెవ్వరికీ నష్టంకలిగే అవకాశంలేదు. అందుకనే బయటపెడుతున్నాను. ఆరోజువరకు నీకు యివ్వలేనిదంటూ నాదగ్గర యేదీ లేదు...కాని యెందుచేతనో తెలుసా?

రమ :-(తల ఆడించి) ఊహు...

రమే :-కాని, విని కోపగించకు...సిగ్గుపడకు. ఏదో పూర్వకాలపుకథ వింటున్నానని అనుకో...రమా...నిన్ను నేను ప్రేమించేవాడ్ని. నిన్ను ప్రేమించినట్లుగా, యెవ్వరూ మరింకెవరినీ ప్రేమించి ఉండరని అనుకునేవాడ్నికూడా...చిన్నతనంలో మనిద్దరికి పెళ్ళి జరుగుతుందని అమ్మ అంటూండగా వింటూండేవాడ్ని. కాని దానితరువాత అంతా చెడిపోయినపుడు... ఆరోజున... సరే... ఇన్ని సంవత్సరాలు గడచిపోయాయి. ఐనప్పటికీ నిన్నమొన్న జరిగిన విషయమని అనిపిస్తుంది... (రమేశ్ వైపు చూసి, రమ ఒక క్షణంపాటు కంపిస్తుంది. తరువాత తలవంచుకుని నిశ్చలంగా కూర్చుని ఉంటుంది)

రమే :-ఈ విషయం అంతా చెప్పటం అన్యాయమని నువ్వు అనుకుంటూ ఉంటావ్...నాకూ యీ సందేహమే ఉంది. అందువల్లనే ఆ రోజున తారకేశ్వరంలో నువ్వుచేసిన ఆదరసత్కారంవల్ల నా జీవనక్రమం మారిపోయినప్పుడు కూడా, మాట్లాడకుండా ఊరుకున్నాను. అప్పుడైనా యేమీచెప్పలేదు. కాని ఆరోజున నా మౌనంలోనున్న వ్యథను

మానవ్వటానికి తగినసాధనం, బహుశా కేవలం భగవానుని చేతిలోనే ఉండి ఉంటుంది.

రమ :-(సహించలేక) ఆయనచేతిలో ఉన్నదేదో, దానిని అక్కడనే ఉండనియ్యి రమేశ్...

రమే :-అది అక్కడనే ఉంది రమా...

రమ :-ఐతే...ఇవ్వాళ నీయింట్లో నన్ను ఇలా యెందుకు అవమానిస్తున్నావ్ ?

రమే :-అవమానమా ? ఏమీ కాదు...ఇందులో మానావమానాల ప్రసక్తిలేదు. ఎవరికథ ఐతే వింటున్నావో ఆ రమవు నువ్వు మొదటకానేకావు... ఇప్పుడు నేను ఆ రమేశుణ్ణి కాదు.

రమ :-రమేశ్...మీరు మీ విషయం చెప్పండి. రమసంగతి మీకంటె నాకు బాగా తెలుసు.

రమే :-ఏమైనా...నా మాట విను. ఆ రోజున నాకు ఒకపూర్తి నమ్మకం కల్గింది. నువ్వు ఏమన్నా ఏంచేసినా, నాకు కలిగే కష్టాన్ని మాత్రం నువ్వు సహించలేవని అనుకున్నాను. ఇలా ఎందువల్ల అనుకున్నానో నాకే తెలియదు. చిన్నతనంలో నువ్వు ఒకప్పుడు నన్ను ప్రేమించావనీ, ఒకసారి నీచేతితో నా కన్నీళ్ళు తుడిచినవిషయం, యీనాటికి నువ్వు బహుశా ఒక్కసారిగా మరచిపోయి ఉండవని ఆనాడు అనుకుని ఉంటాను. అందువల్లనే నీతో ఏమీ చెప్పకుండానే, నీ ఏడను కూర్చుని, నా జీవితపు కార్యాలన్నీ ఒక్కటొక్కటిగా చేసుకుందామని నిశ్చయించుకున్నా. కాని ఆ రోజురాత్రి, అక్సిడెంటు, నువ్వే స్వయంగా...అరే...ఇదేమిటి ? బయటయింత గోల జరుగుతోందే...

(తొందరగా గోపాల్ ప్రవేశం)

గోపాల్ :-చినబాబూ...

(అకస్మాత్తుగా రమనుచూసి ఆశ్చర్యపోయి ఆగిపోతాడు)

రమే :-ఏం జరిగింది ?

గోపాల్ :-పోలీసులు భజువాను పట్టుకున్నారు.

రమే :-భజువానా ? ఎందుకని ?

గోపాల్ :-ఆ రోజున రాధాపురంలో జరిగిన సొసైటీలో వాడున్నాడని అంటున్నారు.

రమే :-సరే...నేను వస్తా...పదండి. (గోపాల్ నిష్క్రమణ)

రమే :-యతీంద్రుడు నిద్రపోయాడు. వాడిని పడుకోనియ్...కాని నువ్వు యిక్కడ ఒక్కనిమిషంకూడా ఉండటానికి వీలులేదు. పోలీసులు సోదాచేయకుండా ఊరుకోరు.

రమ :-(లేచి నిలబడి భయంతో) మీకేం ప్రమాదంలేదుగదా ?

రమే :-చెప్పలేను రమా...అసలు విషయం ఎంతవరకు వచ్చిందోకూడా తెలియదు.

రమ :-మిమ్మల్ని కూడా పట్టుకోవచ్చా ?

రమే :-ఆ...పట్టుకోవచ్చు...

రమ :-(ఒక్కసారిగా యేడ్చి) నేను పోను రమేశ్...

రమే :-(భయంతో) వెళ్ళవ్ ?

రమ :-వాళ్ళు మిమ్మల్ని అవమానిస్తారు... మీమీద దౌర్జన్యం చేస్తారు... వెళ్ళను రమేశ్... ఏమైనాసరే నేను వెళ్ళను...

రమే :-(విచారయుక్త కంఠస్వరంతో) ఛీ...ఛీ... నువ్వు యిక్కడ ఉండకూడదు...నీకేమైనా మతిపోయిందా రాణీ...?

(రమేశ్ చేయిపుచ్చుకుని బలవంతంగా బయటకు పంపివేస్తాడు. అటువైపునుంచి పెద్దగా కాళ్ల చప్పుడు...గోల వినబడుతూంటుంది.)



# తృతీయాంకం

(విశ్వేశ్వరి గది. పెద్దమ్మ, రమేశ్)

పెద్దమ్మ :-ఏం నాయనా...రమేశ్... ! ఆ పేర్ పురపుస్కూలులోనే లీనమై పోతావా ? మా స్కూలులో చదువుచెప్పటానికి వెళ్ళవ్ ?

రమే :-వెళ్లను పెద్దమ్మా ! పడిన శ్రమఅంతా వ్యర్థమైపోయే ప్రదేశంలో, ఒకరిమేలును మరొకరు సహించలేనిచోట, ప్రాణానికి తెగించి పరిశ్రమ చేయటంవల్ల లాభంలేదు. పైగా విరోధులుకూడా యెక్కువవుతారు. దీనికంటెకూడా, ఎవరికి మేలుచేయటంవల్ల దేశానికి కళ్యాణం కలుగు తుందో, ఆ ముసల్మానులు, తక్కువ జాతివాళ్లకోసమే కష్టపడటమే యెంతయినా మంచిది.

పెద్దమ్మ :-ఇదేం కొత్తమాటకాదు నాయనా రమేశ్... ! ప్రపంచంలో ఇంత వరకు ఇతరులకు మేలుచేయాలనుకునేవాళ్లకు విరోధులసంఖ్య ఎప్పుడూ యెక్కువవుతూనేవుంది. ఈ భయంవల్ల వెనక్కి తగ్గిపోయేవాళ్లలోనే నువ్వూ చేరితే, పని యెలాఅవుతుంది నాయనా? ఈ భారాన్ని నిన్ను మోయమనే భగవంతు డాదేశించాడు. దానిని నువ్వే వహించాలి. సరేగాని రమేశ్... నువ్వు వాళ్ల చేతినీరు త్రాగుతుంటావా ?

రమే :-(నవ్వి) మరీబాగుంది... ఈ విషయం నీదాకా వచ్చిందీ ? పెద్దమ్మా... నేను కులభేదాలను పాటించను.

పెద్దమ్మ :-కులభేదాలను పాటించవ్ ? ఇదేమన్నా అబద్ధమనుకుంటున్నావా? లేకపోతే యిదంత పాటించదగిన విషయం కాదనుకున్నావా ?

రమే :-కులభేదాలున్నాయని ఒప్పుకుంటాను. కాని అది మంచిదంటేమాత్రం అంగీకరించను. దీనివల్ల యెన్నెన్ని పోట్లాటలు, యెంతెంత నష్టం కలుగుతూందో తెలియదు. మానవుణ్ని హీనుడని అవమానించటంవల్ల కలిగే ఫలితాన్ని నువ్వు కళ్లారా చూడటంలేదా పెద్దమ్మా! దగ్గర డబ్బు లేకపోవటంవల్లనేగా, ఆ రోజున ద్వారకమహారాజ్ ప్రాయ శ్చిత్తం జరగకుండా ఆగిపోయింది. ఈ కారణంవల్లనే ఆయన శవాన్ని కూడా యెవరూ ముట్టుకోవటానికి ఒప్పుకోలేదు. ఇది నీకు తెలియదా పెద్దమ్మా ?

పెద్దమ్మ :-తెలుసు నాయనా... అంతా తెలుసు... కాని దీనికి అసలు కారణం కులభేదాలు కాదు. ఒకప్పుడు యిక్కడున్న యదార్థమేదో, అది యీ ఊరిలో ఒక్కసారిగా లోపించింది... ఇక యిప్పుడు మిగిలున్న దల్లా అర్థంలేని ఆచారాలు, కుసంస్కారం, వాటివల్ల కలిగిన లేనిపోని కట్టుబాట్లు...

రమే :-దీనికేం విరుగుడులేదా పెద్దమ్మా ?

పెద్దమ్మ :-లేకేం నాయనా... ! దీనికి విరుగుడు కేవలం జ్ఞానమే. నువ్వాసలం భించిన మార్గంవల్లనే దీనికి ప్రతీకారం జరుగుతుంది. అందుకనే జన్మ భూమిని వదలిపోవద్దని నీకు పదేపదే చెపుతూంటాను. నీలాగే ఎక్కడనో, బయటవుండి నేరిగి పెద్దవాళ్ళై, తమ ఊరువచ్చి, అన్ని బంధాలు త్రెంచుకుని పట్టణాలకు తిరిగి పోకుండా ఉన్నవాళ్లే ఉంటే యీ పల్లెలకు ఈ దుర్గతే పట్టేదికాదు. వాళ్లు యెన్నటికీ గోవిందరంగూలీని నెత్తిన యెక్కించుకుని, నిన్ను దూరంచేసి ఉండేవారుకారు.

రమే :-కాని పెద్దమ్మా... ! దూరంగా పోవటానికి నాకేం విచారంలేదు.

పెద్దమ్మ :-కాని యీ దుఃఖమే అన్నిటికంటె పెద్దది నాయనా... ! ఏమైనా మధ్యలో నువ్వు యీ విధంగా అంతావదిలి వెళ్లిపోతే, నీ జన్మభూమి నిన్ను యెన్నటికీ క్షమించదు.

రమే :-ఇది నా ఒక్కడి జన్మభూమే కాదుగా పెద్దమ్మా ?

పెద్దమ్మ :-నీది కాకపోవటేమిటి నాయనా... కేవలం నీ తల్లే... తల్లి ఎప్పుడూ నోరుపెట్టుకుని తనపిల్లల్ని యేమీఅడగదు... ఇది నువ్వు చూస్తూనే ఉన్నావుగా... అందువల్లనే ఇంతమంది ఉన్నప్పటికీ, ఎవరిచెవులకూ, ఆమె ఏడ్పు వినబడలేదు. కాని నువ్వురావటమే తడవుగా, దానిని విన్నావ్...

రమే :-(కొంచెంసేపు తలవంచుకుని మాట్లాడకుండా ఊరుకుని) పెద్దమ్మా... నిన్నొక విషయం అడగనా ?

పెద్దమ్మ :-ఏమిటి నాయనా ?

రమే :-నేను నీ కులభేదాలనుపాటించను. కాని వాటినినువ్వు అంగీకరిస్తావుగా?

పెద్దమ్మ :-నువ్వు అంగీకరించవని నన్నూ మానెయ్యమంటావా ?

రమే :-కాని నేను ఎవరుముట్టుకున్నా తింటాను. మరి నేను ముట్టుకున్నది నువ్వు ఎలా తింటావు పెద్దమ్మా ?

పెద్దమ్మ :-ఎందుకు తినను నాయనా? నువ్వు నా పిల్లవాడివి. అందులోనూ ఇలానూ అలానా? ఎంతో మంచి పిల్లాడివి. ఆడదానినైఉండి ఇంతటి మాట ధైర్యంగా అనగలనా?

రమే :-(వంగి పెద్దమ్మ పాదధూళి నెత్తిన ఉంచుకొని) పెద్దమ్మా...నిన్ను పూర్తిగా తెలుసుకోగలనని ఆశీర్వదించు.

పెద్దమ్మ :-(నుదురుపట్టుకుని, ముద్దుపెట్టుకుని) చాలు...చాలు...ఇక అయి పోయిందిలే...ఇంకా నా పూజ అవనేలేదు నాయనా...కొంచెంసేపు కూర్చుంటావా?

రమే :-లేదు పెద్దమ్మా...నాకూ బడికైము అయిపోయింది.

పెద్దమ్మ :-సరే...మళ్ళీ వీలున్నపుడు రా... (ఇద్దరి నిష్క్రమణ)

(ఒకవైపునుంచి రమ, మరొకవైపునుంచి దాసీ ప్రవేశిస్తారు)

రమ :-రాధా... పెద్దమ్మ ఎక్కడుంది?

దాసి :-ఇప్పుడే పూజచేసుకోవటానికి వెళ్ళారమ్మా...యెంతోసేపు పట్టదు... కూర్చోండమ్మా...

(వేణీ ప్రవేశిస్తాడు. ఆయన రావటంతోనే దాసీ అక్కడనుంచి వెళ్ళిపోతుంది)

వేణీ :-నువ్వు రావటంచూసే వచ్చానురమా... నీతో ఎన్నో సంగతులు మాట్లాడవలసి ఉంది. అమ్మ పూజచేసుకోవటానికి వెళ్ళిందా ఏం?

రమ :-రాధ అలాగే చెప్పింది...

వేణీ :-అన్ని విషయాలు ఆలోచించి మరీ పనిచెయ్యాలమ్మా... లేకపోతే విరోధిని అణగద్రొక్కటం కష్టమైపోతుంది. తన యజమాని ఆజ్ఞ ప్రకారం చేపలు వసూలుచేయటానికని, లాఠీపుచ్చుకుని ఆ రోజున యింటిమీదకు దౌర్జన్యంగా భజువా వచ్చాడని నువ్వు రిపోర్టులు యివ్వకపోతే ఆ వెధవ ఈరోజునయిలా జైలులో ఉండేవాడంటావా? దానితోబాటు రెండుమూడు మాటలు కలిపి, రమేశ్‌నుకూడా చేర్చి ఉంటే...కాని అప్పట్లో మీరెవ్వరూ నామాటైనా విన్నారుకాదు... అబ్బే...నువ్వేం గాబరాపడకు...అక్కడికివెళ్ళి నువ్వు ఏమీ సాక్ష్యమివ్వవలసిన అవసరంలేదు. ఐనా ఒకవేళ వెళ్ళవలసివచ్చినా, తప్పేముంది? జమీందారీ కాపాడుకోవాలనుకుంటే, వెనక్కిఅడుగు వెయ్య

టంవల్ల ప్రయోజనంలేదు. అదీకాకుండా రమేశ్, కష్టపెట్టాలనే మన తాతలు సంపాదించిన లక్షరూపాయల సొమ్ము తగలేశాడు. పేర్ పూర్‌లో స్కూలు పెట్టాడు. ఆ ముసల్మానులకు అసలు జమీందారు లంటేనే మంట. పైగా వ్రాయటం చదవటం నేర్చుకున్నారా, మనకు జమీలు నిలబెట్టుకోవటమే, కష్టమైపోతుంది. నేను యీ మాట యిప్పుడే చెప్పేస్తున్నా...

రమ :-మంచిదే... పెద్దన్నయ్యా...డబ్బు, జమీందారీ పోయేటట్లయితే, దీని వల్ల రమేశ్‌కుకూడా స్వయంగా తక్కువనష్టం కలగక పోదుగా...

వేణీ :-(కొంచెంసేపు ఆలోచించి) ఆ... కాని రమా...ఇటువంటి విషయాలలో యెవ్వరూకూడా తన నష్టాన్ని గురించి ఆలోచించరు. ఈ సంగతి నీకు తెలియదు. మనిద్దరం విచారపడితేనే వాడికి సంతోషంగా ఉంటుంది. ఇక్కడికి వచ్చినప్పటినుంచి డబ్బు యెలా తగలేస్తున్నాడో నువ్వూ చూస్తున్నావుగా...తక్కువజాతి వాళ్ళందరిలో చినబాబుపేరు మారు మ్రోగి పోతోంది. ఇదైనా యెన్నాళ్లో సాగదులే...పోలీసులదృష్టిలో వాడిని పడేశావుగా...దీనితో వాడికి అంతం సమీపిస్తుందిలే...

రమ :-పోలీసులకు రిపోర్టు నేనే చేయించానని, రమేశ్‌కు యేమన్నా తెల సిందా ?

వేణీ :-నాకు సరిగా తెలియదు... కాని యీ విషయం వాడికి తప్పకుండా తెలుస్తుంది... ఈ భజువా వ్యవహారంతో అన్ని విషయాలు బయటికి వస్తాయిగా ?

రమ :-(కొంచెంసేపు ఆలోచించి) ఐతే పెద్దన్నయ్యా... ! ఈ రోజున ప్రతి వాళ్ళు ఆయన్నే యెందుకు పొగడుతున్నారంటావ్ ?

వేణీ :-అ... ఒకవిధంగా యిదీ నిజమే... కాని రమా ! నేను వాడిని ఒక పట్టాన వదలిపెట్టను. వాడు ప్రజలకందరికీ చదువుచెప్పి, వాళ్లని చెడ గొడుతూంటే, జమీందారునై నేను చూస్తూ ఊరుకుంటానా ? ఇలా కలలోకూడా యెవ్వరూ అనుకోవద్దు. ఆ ఆచార్యులు వెధవ భజువా వైపున సాక్ష్యంయిచ్చాడు. ఇప్పుడు తనకూతురు పెళ్లి యెలాచేస్తాడో నేనూ చూస్తా...

రమ :-ఏమిటి పెద్దన్నయ్యా అంటున్నావు ?

వేణీ :-ఒకసారి వాడిని ఒక ఆట ఆడించి చూడవద్దంటావా ? నాకు వ్యతి

లేకుంగా కోర్టులో నిలబడి సాక్ష్యం యిస్తాడా...? ఇచ్చి యీ ఊళ్లో తన పిల్లలతో కాపురంచేయటంకూడానా...? వీడి భరతం పట్టనూ...? ఈ ఆచార్యులా? వీడొక చిన్న చేప... పెద్దపెద్ద చేపలా...? అవీ ఉన్నాయ్... ఈ విషయంలో గోవింద బాబాయ్ యేమంటాడో కనుక్కుంటూ... దొంగతనాలు, దోపిడీలు యిక్కడ సామాన్యంగా జరుగుతూనే ఉంటాయ్... ఇప్పుడు నౌకరును జైలుకు పంపించ గల్గాను. ఇక యజమానిని పంపించటం యేమంత కష్టంలే...

రమ :-(ఎక్కువ ఆశ్చర్యంతో వేణీ మొగంవైపు చూసి) ఏమంటున్నావు... పెద్దన్నయ్యా? రమేశును జైలుకు పంపిస్తావా?

వేణీ :-ఏం...? ఎందుకు పంపించకూడదు? వాడేమన్నా దేవదూతాయేం? చేతికి దొరికితే వాడిని ఊరికే వదిలెయ్యమంటావా? నువ్వు యిలా అంటున్నావేం?

రమ :-(కోమల స్వరంతో) రమేశ్ ఒకవేళ జైలులోపడితే, అది మనకు అవమానంకాదూ?

వేణీ :-ఎందుకని? మనకేం అవమానం?

రమ :-ఏమైనా ఆయన మనవాడేగా! ఆయన్ని మనం కాపాడుకోకపోతే అంతా మన మొగాన ఉమ్మేయ్యరూ...?

వేణీ :-ఎవడు యేంచేస్తే, అది అనుభవిస్తాడు... దానితో మనకేం సంబంధం?

రమ :-రమేశ్ దొంగతినాలు, దోపిడీలు ఏం చెయ్యటం లేదుగా...ఇతరుల మేలుకోసం తన సర్వస్వాన్ని త్యాగంచేస్తున్నాడని అందరికీ తెలుసు. ఇలాచేస్తే ఆ తర్వాతనైనా మనం ఊళ్లో మొగం చూపించగలమా...

వేణీ :-ఆఖరికి నువ్వు యిలా మారిపోయావేం చెల్లీ?

రమ :-ఊళ్లోవాళ్లు, భయంవల్ల మన మొగాన అనకపోవచ్చు. కాని చాటున అయినా అంటారుగా...వీపు వెనక్కి త్రిప్పితే రాజుగారి తల్లినైనాసరే ప్రజలు రాక్షసిఅని అంటారని నువ్వు అనవచ్చు. కాని దేవుడంటూ ఒకడున్నాడుగా...నిరపరాధులను అన్యాయంగా దండింపచేస్తే, దేవుడైనా, ఊరికే వదలిపెడతాడా...

వేణీ :-అమ్మో...అదృష్టమా...అరే...ఆ వెధవకు దేవుడు దెయ్యం అంటే ఏమైనా నమ్మకం ఉందనుకుంటున్నావా? శివాలయం పడిపోతోంది... దాని మరమ్మతుచేయించటానికి, డబ్బుకోసం వాడిదగ్గరకు మనుష్యుల్ని

పంపితే ఏమన్నాడో తెలుసా...ఇలాంటి దుబారాఖర్చులకు నాదగ్గర డబ్బులేదన్నానని చెప్పు...పొమ్మన్నాడట...విన్నావావాడిమాటలు. ఇది దుబారాఖర్చా...తక్కువజాతివాళ్లకోసం స్కూలు తెరవటం సరియైందా ?...అదీకాకుండా బ్రాహ్మణపిల్లవాడై ఉండికూడా సంధ్యావందనం ఏమీచెయ్యడు. పైగా ముసల్మానుల చేతినీళ్ళుకూడా త్రాగుతాడని విన్నాను. చెల్లీ... నాలుగు యింగ్లీషుముక్కలు చదువుకున్నంత మాత్రాన, వాడికి కులం యేమీ లేకుండాపోవాలా ? వాడు అనుభవించాల్సినశిక్ష ఎక్కడికిపోతుంది ? వాడికి శిక్షఅంతా కూడబెట్టి ఉంచాలే...అంతా ఒకరోజున చూస్తారుగా...

(రమ మాట్లాడదు)

వేణీ :-ఇక నేను వెడతాను. అవకాశం దొరికితే, మళ్లీ నిన్నొకసారి కలుసుకుంటాలే...బహుశా గోవిందబాబాయ్ వచ్చి బయట కూర్చున్నాడేమో...

రమ :-నేనూ వెడతాను పెద్దన్నయ్యా... (ఇద్దరి నిష్క్రమణ)

(రమేశ్ ప్రవేశిస్తాడు)

రమే :-రాధా...రాధా... (దాసీవస్తుంది)

రాధ :-ఏం చినబాబూ...

రమే :-పెద్దమ్మ పూజచేసుకుని వచ్చిందా ? అప్పుడు ఆవిడతో ఒకమాట చెప్పటం మరచిపోయాను.

రాధ :-ఇంకా రాలేదు. ఏం పిలవమంటారా బాబూ...

రమే :-వద్దులే... నేను సాయంకాలం వస్తానన్నానని చెప్పు...

రాధ :-సరే బాబూ... (తొందరగా గోపాల్ వస్తాడు)

రమే :-ఇలా వచ్చారేం ?

గోపాల్ :-చినబాబూ...చూస్తూ ఊరుకుంటే లాభంలేదు. మీకోసం అంతా గాలిస్తున్నాను. భైరవాచార్యులు ఏంచేశాడో చూశారా ? మనల్ని పూర్తిగా దగాచేశాడు.

రమే :-ఏమిటి ?...ఎలా ?...

గోపాల్ :-యజమాని స్వర్గస్థులైనపుడు, దుఃఖంతో ఇక అయిపోయింది... శాంతంగా ఉందామనుకున్నా...కాని అది సాధ్యంకావటంలా...

యేమైనాసరే, చినబాబూ...నన్ను మీరు యిక ఆపలేరు. ఆచార్యులు చేసినదానికి, వాడికి దానిఫలితం రుచిచూపిస్తా...తప్పకుండా వాడికి బుద్ధిచెపుతాను...దీనికి ప్రతీకారం చేసితీరాలి...ఏమైనాసరే...ప్రతీర్చు కుంటాను...ఇవ్వాళే కోర్టుకు వెడతాను.

రమే :-గుమాస్తాజీ...అసలు యేంజరిగింది ? ఆఖరికి మీవంటి శాంతమూర్తి యింతగా ఉత్తేజితులవటానికి ఆచార్యులు యేంచేశాడు ?

గోపాల్ :-ఏంచేశాడని అడుగుతున్నారా ?—కృతఘ్నపు వెధవ...అప్పుడే నేను అనుకున్నాను. వీడి ఆసిఅంతా వేలంఐతే అవనీ...మనం యిందు లో కలగజేసుకోవద్దని... కాని ఆ సమయంలో, స్వర్గంలోవున్న యజ మాని దుఃఖపడతారని భయపడ్డాను...వారి స్వభావం నాకు తెలుసు... అందుచేతనే, మిమ్మల్ని సాయంచేయవద్దని వారించలేకపోయాను.

రమే :-కాని గుమాస్తాజీ...నాకేం అర్థంకావటంలేదు ?

గోపాల్ :-ఆ రోజున మీ ఆజ్ఞప్రకారం నేనుకోర్టుకువెళ్లి డిక్రీసొమ్ముచెల్లించి, వ్యాజ్యపు విషయం అంతా సరిచేసివచ్చాను... మొన్ననే భైరవా చార్యులు కోర్టుకువెళ్ళి స్వయంగా దావా ఎత్తేసుకున్నాడని ఇప్పుడే కబురు తెలిసింది. బాకీ తను యివ్వవలసివుందని ఒప్పుకున్నాడట...

రమే :-దీని అర్థం ?

గోపాల్ :-దీని అర్థమా...మనం కోర్టులో చెల్లించిన డిక్రీసొమ్మంతా పోయిం దన్నమాట. మన మొగాన మట్టికొట్టి యిప్పుడు ముగ్గురూ ఆసొమ్ము పంచుకుని తింటారు. గోవింద గంగూలీ...వేణిబాబు...తను...మీకు తెలియదనుకుంటా...ప్రొద్దున్న నుంచీ, ఆచార్యులగారింటిదగ్గర బాజా భజంత్రీలు మ్రోగుతున్నాయి...అట్టహాసంగా మనవడి అన్నప్రాశన జరుగుతుంది. ఆడబ్బుతోనే ఊళ్లో బ్రాహ్మలంతా ఫలహారాలు మెక్కు తారు. కాని ఉన్నవిశేషం యేమిటంటే—మీకుమాత్రం అక్కడ స్థానంలేదు. ఉన్నదల్లా గోవింద గంగూలీకి...మిమ్మల్ని వాళ్లు కులంలో నుంచి వెలివేశారు.

రమే :-భైరవాచార్యులా ? ఇదంతా చేశాడా ?

గోపాల్ :-చెయ్యలేకేం...ఎందుకని చేయలేడు ? పల్లెటూరివాళ్లు చేయలేని దంటూ, ఏముందనే యిప్పుడు మనం తెలుసుకోవాలి. సరే నేను వెడు తున్నాను.

రమే :-వెళ్ళండి... కాని నేను ఆలోచిస్తున్నదల్లా, యీ మహా పాతకానికి ప్రాయశ్చిత్తం యెలా జరుగుతుందనే...

గోపాల్ :-నా సాక్ష్యం ఉంది... ఇంకా కోర్టు తెరచేఉంది... చినబాబూ వాడిని ఒకపట్టాన వదలిపెట్టను. (నిష్క్రమణ)

రమే :-దీనికి చట్టం ఏమంటుందో తెలియదు... అసలు కోర్టులో కృతఘ్నతకు శిక్షఅంటూ ఉందోలేదో కూడా తెలియదు. దానిని ఆలావుండనిద్దాం. ఇవాళ యీ భారం నేను స్వయంగానే మోస్తాను... కేవలం సహిస్తూ పోతూండటమే ప్రపంచంలో, పరమ ధర్మం కాదు... (నిష్క్రమణ)

# 2

(భైరవ ఆచార్యులు యింటి ముందుభాగం. మనుమడి అన్న ప్రాశన. అందుకని బయటగుమ్మంమీద మంగళకలశం ఉంచబడి ఉంటుంది. దర్వాజాలకు మామిడి తోరణాలు కట్టబడి ఉంటాయ్... నసారాలో ఒకప్రక్క సన్నాయి వాయిద్యగాళ్లు కూర్చుని ఉంటారు... ముందువరండాలో గోవింద గంగూలీ, వేణి మొదలైనవారు కూర్చుని ఉంటారు. కొంతమంది నవ్వుతుంటారు. మరికొంతమంది హుక్కా పీలుస్తూంటారు. కొద్ది సేపట్లో హుక్కా క్రిందపెట్టి దీనూభట్టాచార్య బయటికి పోతుంటాడు. ఇంతలో రమేశ్ అక్కడికి వస్తాడు. చూడటంతోనే చాలా ఉత్తేజితుడుగా నున్నట్లు కనబడుతుంది. అతను అకస్మాత్తుగా రావటంవల్ల అంతా గాబరాపడతారు.)

రమే :-ఆచార్యులుగారు యెక్కడ ?

దీనా :-(దగ్గరకు వచ్చి) పద... నాయనా... ఇంటికి పోదాంపద... భైరవాచార్యులకు నువ్వు చేసిన సాయం వాడి తండ్రైనా చేసి ఉండడు. కాని దారి యేముంది...? అందరూ తమ పిల్లా-జెల్లాతో కాపురాలు చేసుకోవాలిగా...! ఒకవేళ ఆచార్యులు నిన్ను ఆహ్వానించడానికి వచ్చి ఉంటే— తెలిసిందిగా నాయనా ?... అవునా— ?... దీనికి భైరవు

డిది తప్పు అనటానికే వీలులేదు. మీరా... ఈకాలపు బస్తీ పిల్లలు... కులమతభేదాలు పాటించరు... అందుకని... తెలిసిందా బాబూ...? రెండు రోజుల తర్వాత చిన్నకూతురు పెళ్లిజరుగుతుంది. దానికైనా పన్నెండు ఏళ్ళుదాకా వచ్చాయి...ఏమైనా దీనిపేడకూడా వరించుకోవాలిగా...? మన సంఘపు స్థితి నీకు తెల్సుగా నాయనా...?

రమే :-ఆ...అంతా తెల్సుకున్నాను... ఆయన యెక్కడున్నాడో మీరైనా చెప్పండి?

దీనా :-ఉన్నాడు బాబూ... ఇంట్లోనే ఉన్నాడు. కాని ఆ బ్రాహ్మణుడిదైనా తప్పు అని యెలా అనను? (అందరివంక చూసి) మన ముసలివాళ్లకు పరలోకం అంటే కొద్దోగొప్పో భయం—

రమే :-ఆ... ఆ... బాగానే ఉంది... కాని భైరవఆచార్యులు యెక్కడ?

(భైరవాచార్యులు ప్రవేశిస్తాడు)

భైరవ :-(వేణీబాబూతో వినయపూర్వకంగా) పెదబాబూ...! చూడండి... తమందరికీ తర్వాత కష్టం........ (అకస్మాత్తుగా రమేశును చూసి, పిడుగు మీదపడినవానిలాగ నిశ్చేష్టుడైపోతాడు.)

రమే :-(తొందరగా ముందుకు వచ్చి చెయ్యిపట్టుకుని) ఏం...ఇలా ఎందుకు చేశావు?... ఇవ్వాళ నేను........

భైరవ :-పెదబాబూ... గోవిందగంగూలీ... ఊరంతా చూస్తున్నారుగా?

రమే :-(గట్టిగా విదలించి) పెదబాబూ...గోవిందగంగూలీ...ఇవ్వాళ అందరికీ చూపిస్తాను...ఇలా ఎందుకుచేశావో చెప్పవేం?

(వేణీ మొదలైనవారు అంతా తొందరగా పారిపోతారు)

భైరవ్ :-(ఏడుస్తూ) లక్ష్మీ... తొందరగా పోలీసులకు కబురుచెయ్యవే... అరె...చంపేస్తున్నాడు.

రమే :-నోరుముయ్...చెప్పు...ఇలా యెందుకుచేశావ్?

భైరవ్ :-బాబోయ్...చంపేస్తున్నాడు...

రమే :-చంపేస్తాను...నిన్ను ఖూనీచేసి మరీ యింటికి వెడతాను.

(ఈ మాటలే అని మాటిమాటికి విదలిస్తూంటాడు. లక్ష్మీకూడావచ్చి బిగ్గరగా యేడుపు ప్రారంభిస్తుంది. ఇంతలో జనంపోగయి నాలుగువైపులనుంచి తొంగిచూస్తూంటారు.)(తొందరగా రమవస్తుంది)

రమ :-(రమేశ్ చేయిపట్టుకుని) చాలు... ఇక వదిలేయండి...

రమే :-ఎందుకనేం ?

రమ :-వీడిని చేయిచేసుకుంటారా ?

రమే :-ఇవ్వాళ వీడిని యేమైనాసరే వదలిపెట్టను.

రమ :-(బలవంతంగా చేయివిడిపించి) ఇంతమందిజనంలో మీకేం సిగ్గులేదూ... కాని నేను సిగ్గుతోచస్తున్నాను రమేశ్... వెళ్ళండి... ఇంటికి...

రమే :-(కొంచెంసేపటివరకు ఆమెవంక నిశ్చలంగాచూసి) సరే... వెడుతున్నాలే...

(రమేశ్ నెమ్మదిగా అక్కడినుంచి వెళ్ళిపోతాడు. తరువాత వేణీ, గోందగంగూలీ, తతిమావాళ్ళువస్తారు. భైరవుడు నేలమీదకూర్చుని, రెండు మోకాళ్ళమీద తలవుంచి యేడుస్తూంటాడు)

గోవింద :-ఇంటిమీదకు వచ్చిపడి సగంచంపిపోయాడు. ముందుదీనికి ఏంకట్టుదిట్టంచేయాలా అనే ఆలోచించాలి.

వేణీ :-నేనూ అదే అంటున్నా...

రమ :-కాని పెద్దన్నయ్యా... ఈ వైపున తప్పుకూడా తక్కువయేంకాదుగా ? యేం జరిగిందని దీనికింత అట్టహాసం చేయటం...

వేణీ :-ఏమంటున్నావు రమా ? యేంజరిగిందనా ? ఇది సాధారణపు విషయం అనుకున్నావా ? మనం యెవ్వరూలేకపోతే, ఖూనీచేసేవాడే...

రమ :-ఆయన చేయదలచుకుంటే మనం ఆపలేంకూడా... అన్నయ్యా...

లక్ష్మీ :-నువ్వుకూడా ఆయన తరపునే మాట్లాడుతావా రమక్కయ్యా... ? నీ యింట్లో దూరి యిలాగే యెవరైనా నీ తండ్రిని చంపితే యేంచేసేదానివి ?

రమ :-లక్ష్మీ ! నా తండ్రికి, నీ తండ్రికి చాలా తేడావుంది. ఏంపోలిం తీసుకురాకు. నేనేం యెవరి తరపునా చెప్పటంలేదు... న్యాయం యేదో అదే చెపుతున్నా...

లక్ష్మీ :-మాబాంది. ఆయన్ని వెనకవేసుకు రావటానికి నీకేం సిగ్గులేదు ? పెద్దింటిపిల్లవుకదూ... అందుకని భయంవల్ల యువ్వరూ యేమీఅనరు. లేకపోతే తెలియం దెవరికి ? నువ్వెకనక మొగం చూపిస్తున్నావు... ఇంకొకళ్ళు ఐతేనా మెడకు ఉరేసుకుని చద్దురు......

వేణి :-(లక్ష్మితో) లక్ష్మీ...! నువ్వూరుకో... నీకు యీ విషయాలన్నీ యెందుకు ?

లక్ష్మి :-ఎందుకా ?... నాన్న యింతగా బాధపడ్తాడే... ఆయన్ని వెనకేసుకుని పోట్లాడుతుందా ? ఒకవేళ నాన్న చచ్చిపోతే...... ?

రమ :-(లక్ష్మితో) లక్ష్మీ !... ఆయనలాంటి మనిషి చేతిలో చావటం చాలా అదృష్టం... ఇవ్వాళ చనిపోయినట్లయితే, మీ నాన్న స్వర్గానికి వెళ్లేవాడే........

లక్ష్మి :-బహుశా అందుకనే కాబోలు రమా...ఆయన చేతిలో చచ్చాడ్...

రమ :-(కొంచెంసేపు ఆమె మొగంవైపు తదేకదీక్షగా చూసి, మొగం ప్రక్కకు త్రిప్పుకుంటుంది) అసలు విషయంఏమిటో నువ్వే చెప్పరాదా పెద్దన్నయ్యా...

వేణి :-నాకేం తెలుసునమ్మా...లోకం ఎన్నో అనుకుంటుంది...వాటన్నిటినీ మనస్సుకు పట్టించుకుంటే ఎలాగమ్మా...

రమ :-లోకం ఏమంటోంది ?

వేణి :-అంటే అననీ... లోకులు అనుకున్నంత మాత్రాన వళ్లుఏమీ బొబ్బ లెక్కదు...అనుకోనీ...

రమ :-బహుశా దేనివల్లకూడా నీ వళ్ళు బొబ్బలెక్కదనుకుంటా... కాని అందరివంటి మీదా ఖడ్గమృగపు చర్మం ఉండదుగా... కాని లోకుల చేత యీ మాట అనిపిస్తోంది ఎవరు ? నువ్వేనా ?

వేణి :-నేనా ?

రమ :-నువ్వుతప్ప యింకెవరు ? నువ్వు చేయలేని దుర్మార్గం అంటూ యీ ప్రపంచంలో యేదీలేదు. కుట్ర, మోసం, దొంగతనం, ఇంటికి నిప్పు పెట్టటం అన్నీ అయిపోయాయి. ఇక యిదిమాత్రం ఎందుకుమిగలాలి ? స్త్రీకి యింతకంటె సర్వనాశనమైనది మరొకటిలేదని తెలుసుకునే శక్తి నీకులేదు. కాని ఒక్కటి అడుగుతున్నా...ఎందుకు యీ విధంగా పగ పట్టి తిరుగుతున్నావు ? ఈ అపవాదు వేయటంవల్ల నీకేం లాభంవుంది?

వేణి :-నాకేం లాభంవుందా ? రాత్రిపూట రమేశ్ యింట్లోనుంచి నువ్వురావటం లోకులుచూస్తే నేనేం చెయ్యగలను ?

రమ :-ఇంతమందిలో అన్నివిషయాలు నేను చెప్పదలచుకోలేదు. కాని పెద్దన్నయ్యా నీ మనసులో ఏముందో నాకు తెలియదనిమాత్రం అనుకోకు.

నేను రమనని బాగా జ్ఞాపకం ఉంచుకో...ఒకవేళ నేనుచస్తే...నిన్ను మాత్రం బ్రతికి ఉండనివ్వను. (తొందరగా వెళ్ళిపోతుంది)

గోవింద :-పెదబాబూ...ఇదంతా యేమిటి? ఆడది? నిన్నుకూడా జెదరించి పోయిందే...ఈజీవితంలో కళ్ళతో యిదికూడా చూడవలసివచ్చిందే...

వేణీ :-(తలపట్టుకుని) బాబాయ్...ఇందులో యెవరితప్పు యేమీలేదు... తప్పంతా దీనిది. కలికాలం. దీని పేరే కాలమహాత్యం. ఇంతవరకు ఒకళ్ళకి ఉపకారం తప్ప అపకారం యెన్నడూ చేయలేదు. ఎవరికీకూడా అపకారం చేద్దామనే ఆలోచనే మనస్సులోకి రాలేదు. ప్రపంచంలో నాకుతప్ప యిలాంటిస్థితి మరెంకెవరికి కలుగుతుంది. విద్యాసాగరుడు యేమయ్యాడు? ఆయనగతి యేమైందో నీకూ తెలుసుగా...

గోవింద :-తెలియకేం...అంతావిన్నాను.

వేణీ :-సరిగా...అదేవిషయం...తప్పు యింకెవరిదని అనను? (భైరవుడివైపు చూపిస్తూ) వీడిని కాపాడటానికి నివెళ్ళి ఉండకపోతే ఏంజరిగి ఉండేది కాదు. కాని ప్రాణంవుండగా యిలా ఊరుకోవటం నాతరంకాదు.

# 3

(స్థలం :—నిర్జనమైన పల్లెదారి. రమేశ్ తొందరగా ప్రవేశిస్తాడు. రమ చాటునఉండిపిలుస్తుంది-"రమేశ్...?" వెంటనే ఎదురుగానచ్చి నిలబడుతుంది)

రమే :-రమా? ఇంతదూరంలో...ఈ నిర్జనమైన దారిలో నువ్వా?

రమ :-పీర్పూర్ స్కూలులో పనిముగించుకుని మీరు రోజూ యీ దారి వెంటే వెడతారని నాకు తెలుసు...

రమే :-ఆ...వెడుతూంటాను...కాని నువ్వు యిక్కడికి వచ్చావేం?

రమ :-మీకు వంట్లో బాగుండటంలేదని తెలిసింది...ఇప్పుడేలాఉంటోంది...

రమే :-ఖులాసాగా ఉండటంలేదు. రోజూ రాత్రిపూట జ్వరం వచ్చినట్లుగా ఉంటోంది.

రమ :-ఐతే కొన్నాళ్ళపాటు బయటతిరిగివస్తే ఆరోగ్యంచేకూరుతుందేమో...

రమే :-(నవ్వి) ఈ సంగతి నాకూతెలుసు. కాని ఎలా వెళ్ళను?

రమ :-వచ్చేతున్నారా? ఎన్నో పనులున్నాయని అంటున్నారు. ఆరోగ్యం కంటెకూడా ముఖ్యమైన పనిఏముంటేం?

రమే :-నా శరీరం అల్పమైనదని అనటంలేదు. కాని మానవుడికి తన శరీరం కంటెకూడా ఎక్కువైన పనులంటూ ఉంటాయి... కాని రమా... యిది నీకు అర్థంకాదు...

రమ :-నేను తెలుసుకోవాలనికూడా అనుకోవటంలేదు. ఏమైనాసరే మీరు ఎక్కడికైనా వెళ్లవలసిందే...గుమాస్తాగారితో చెప్పి వెళ్లండి. అన్ని పనులూ నేను చూస్తుంటాను.

రమే :-నా వ్యవహారాలు నువ్వు చూస్తావా?

రమ :-ఏం చూడలేనా?

రమే :-ఆహా...చూడలేకేం...బహుశా నా కంటెకూడా బాగాచూడగలవ్ ...కాని దీని అవసరంకూడాలేదు. ఐనా నిన్ను ఎలానమ్మమంటావ్?

రమ :-రమేశ్...ఇంకెవరు నమ్మలేకపోయినా మీరుమాత్రం నమ్మగలరు... ఒకవేళ మీరు నమ్మలేకపోయినట్లయితే, ప్రపంచంలోనుంచి విశ్వాసం అనేదేలేకుండా పోతుంది. మీరు యీ భారం నా మీద వదిలివెళ్లండి.

రమే :-(కొంచెంసేపు ఆమె మొగంవైపు చూసి) సరే...ఆలోచిస్తాను.

రమ :-కాని ఆలోచించటానికి వ్యవధి యేంలేదు. ఇవ్వాళ మీరు యిక్కడి నుంచి వెళ్ళిపోవాలి. లేకపోతే—

రమే :-(తిరిగి ఆమె మొగంవైపు తదేకదృష్టితో చూస్తూ) నీమాటల తీరునుబట్టి చూస్తే, వెళ్ళకపోయినట్లయితే, ఆపదకలిగే అవకాశం ఉన్నట్లు తోస్తోంది. సరే...నేను వెడితే నీకు దీనివల్ల లాభం యేంవుంది? నీవైనా స్వయంగా, నన్ను కష్టాలపాలు చేయటానికి తక్కువేం చెయ్యలేదుగా...ఈ రోజున మరొక ఆపదనుగురించి నాకు తెలియజేయటానికి వచ్చావా? ఇవన్నీ నాకు జ్ఞాపకం ఉండకపోవటానికి అవియేమీ బాగా పాతబడిపోలేదు. కాని నేను వెళ్ళిపోవటంవల్ల నీకుకలిగే లాభం యేమిటో స్పష్టంగా చెప్పేశేయ్...బహుశా నీకోసం దీనికి అంగీకరిస్తానేమో...

(ఇంతటి కఠోరపు దెప్పిపొడుపువల్ల రమ మొగపురంగు మారిపోతుంది... ఐనప్పటికీ తనకితాను సంబాళించుకుంటుంది).

రమ :-సరే... నేను స్పష్టంగా చెప్పేస్తున్నాను. మీరు వెళ్లటంవల్ల నాకేం లాభంలేదు. కాని వెళ్ళకపోతేమాత్రం చాల నష్టం కలుగుతుంది. నేను సాక్ష్యం యివ్వవలసి వస్తుంది.

రమే :-ఇంతేనా ? ఈ చిన్న విషయానికే ? ఒకవేళ సాక్ష్యం యివ్వకపోతే ?

రమ :-సాక్ష్యం యివ్వకపోతే మహామాయపూజకు నా యింటికి ఎవరూరారు. యతీంద్రుడి ఉపనయనంలో యెవరూ భోజనంచేయరు. వ్రతాలు... ధర్మకర్మలు— రమేశ్... మీరు వెళ్ళిపొండి... మిమ్మల్ని ప్రార్థిస్తున్నా...వెళ్ళండి...యిక్కడవుండి అన్నివిధాలా నన్ను నాశనం చెయ్యకండి. మీరు యిక్కడినుంచి వెళ్ళిపొండి.

రమే :-(కొంచెంసేపు ఊరుకుని) సరే... నేను వెళ్ళిపోతాను. ప్రారంభించిన పని పూర్తిచేయకుండానే వెళ్ళిపోతాను. కాని నాకు నేను ఏం సమాధానం చెప్పుకోను ?

రమ :-సమాధానం యేమీలేదు. ఇంకెవరైనా ఐనట్లయితే సమాధానాల కేం లోటు ఉండేదికాదు. కాని రమేశ్ ఒకఅల్పమైన స్త్రీయొక్క అఖండ స్వార్థపరత్వానికి మీరు సమాధానం ఎక్కడుందని వెదకగలరు ? నిరుత్తరులై వెళ్ళిపోవలసిందే...

రమే :-సరేలే...అలాగేచేస్తాను. కాని ఇవ్వాళమాత్రం వెళ్ళలేను.

రమ :-నిజంగా వెళ్ళలేరా ?

రమే :-ఊహు...నీ వెంట ఎవరువచ్చారు ? వాళ్లని పిలు.

రమ :-ఎవరూ రాలేదు. ఒంటరిగా నేవచ్చాను.

రమే :-ఒంటరిగా వచ్చావా ? ఇదేమిటి ? రాణి...ఏం ధైర్యంతోవచ్చావ్ ?

రమ :-ఈ దారిలో మిమ్మల్ని తప్పకుండా కలుసుకోగలననేదే నా ధైర్యం... అటువంటప్పుడు నాకేం భయం...

రమే :-నువ్వేం మంచిపని చేయలేదురమా... కనీసం దాసీనైనా వెంటబెట్టుకుని రావలసింది. ఈ నిర్జనపు దారిలో నన్నుగురించైనా జడవటం నీకు ఉచితంగా ఉండేదేమో...

రమ :-మిమ్మల్ని చూసా ? మీరంటే భయపడతానా ?

రమే :-ఏం ఎందుకు భయపడవ్ ?

రమ :-(తల ఆడించి) ఊహు... ఏ విధంగానూ భయపడను. రమేశ్... ఇంకా ఏ ఉపదేశం ఐనా చేయండి... మీ యిష్టం... శిరసా వహిస్తాను. కాని మిమ్మల్ని చూసి భయపడమని, నన్ను భయపెట్టకండి...

రమే :-నేనంటే నీ కంత చులకనా ?

రమ :-ఆ...చులకనేఉంది. ఇప్పుడేగా మీరుఅంది- దాసీనైనా వెంటతీసుకు వచ్చావ్ కాదు. మంచిపని చెయ్యలేదని... కాని ఎందుకు తీసుకుని రావాలో చెప్పండి ? మీ నుంచి రక్షణపొందడానికి దాసీ శరణు పొందుతాననుకున్నారనుకుంటా......ఐతే రమకంటేకూడా దాసీని మీ ముందు గొప్పదై పోతుందా ?

(రమేశ్ మాట్లాడకుండా ఆమె మొగంవైపు చూస్తూంటాడు)

రమ :-ప్రొద్దున్న విషయం జ్ఞాపకంఉందా ? అక్కడ జనానికి ఏం తక్కువ లేదు. కాని మీ ఆకారంచూసి అంతా పారిపోతే, భైరవాచార్యుల్ని ఎవరు రక్షించారు ? ఈ రమ...ఆ సమయంలో దాసీదికాని, నౌకరు కాని అవసరం లేనప్పుడు, ఇప్పుడుకూడా వాళ్ళ అవసరమేఉండదు. కాని యివ్వాళనుంచి మీరు రమకు భయపడండి. ఇది చెప్పటానికే వచ్చాను.

రమే :-ఐతే రమా, నువ్వు వృధాగా వచ్చావన్నమాట. కేవలం నీ లాభం కోసమే నన్ను యిక్కడినుంచి వెళ్ళిపొమ్మని అంటున్నావని అనుకున్నాను. కాని అది కానపుడు, హెచ్చరించటంవల్లకలిగే ప్రయోజనం ఏదీ నాకు కనబడటం లేదు.

రమ :-రమేశ్...ప్రపంచంలో అన్ని ప్రయోజనాలు కళ్ళకు కనబడుతూంటాయా...

రమే :-కనబడని దానిని నేను వప్పుకోను. వెళుతున్నా... (నిష్క్రమణ)

రమ :-(ఒక్కసారిగా ఏడ్చి) గ్రుడ్డివారికి నే నెలా చూపించను...



# చతుర్థాంకం

(రమ పూజామందిరపు వసారాలో ఒకభాగం. దుర్గప్రతిమ స్పష్టంగా కనబడదు. కాని పూజాసామగ్రి ఎదురుగా పెట్టబడి యుంటుంది. మూడవజాము. పూజా కలాపం పూర్తయి పోయింది. ఒకప్రక్క రమ కదలకుండా కూర్చుని ఉంటుంది. ఇంతలో ఇంటిగుమాస్తా వస్తాడు)

గుమాస్తా :-అమ్మా... ప్రొద్దు గడచిపోతోంది. కాని శూద్రులు యెవరూ రాలేదు...అలా వెళ్ళిచూసి రమ్మంటారా ?

రమ :-ఎవరూ రాలేదా ?

గుమా :-రాలేదమ్మా...

(చేతిలో హుక్కా పుచ్చుకుని వేణీ ఘోషాల్ ప్రవేశం)

వేణీ :-ఇస్... ఈ తిండిపదార్థాలన్నీ వ్యర్థం చేయదలచుకున్నారన్నమాట యీ నీచకులపు జనం...ఇంతటి ధైర్యమా... వెధవలకి బాగా శాస్తి చేసి తీరుతాను. వీళ్ళకొంపలు పీకించి పారవేయకపోతే...

(వేణీ మొగంవైపుచూసి రమ నెమ్మదిగా నవ్వుతుంది...జవాబేమీచెప్పదు)

వేణీ :- ఇది నవ్వవలసిన విషయం కాదురమా... పెద్దపెట్టున సర్వనాశనం చేయటం అన్నమాట... దీనికంతకీ మూలం యెవరో తెలిస్తేనా... వాడినిపీకి అవతల పారేస్తాను. ఏ రమేశ్ బాబు అండచూసుకుని యీ వెధవలంతా యెగురుతున్నారో...ఆ రమేశ్ బాబు జైలులోపడి చస్తున్నాడని తెలియదనుకుంటా... ఇప్పుడు వీళ్ళని నాశనం చెయ్యటం ఒకలెక్కా......భైరవాచార్యుల్ని చంపటానికి ఇంటి మీదికి దండెత్తివచ్చాడని, చేతిలో చిన్నకత్తి ఉందని స్పష్టంగా రుజువుచేశాను. అప్పుడు యేవెధవా అడ్డం రాలేకపోయాడు. అరే... నేను తలచుకుంటే రాత్రిని పగలు పగటిని రాత్రి చేసి చూపించగలను. సరేలే... యింకా కొన్నాళ్ళపాటు చూస్తాను. అదీ కాకుండా, శాస్త్రాల్లో చెప్పబడేవుంది. "యదాధర్మః తథా జయః" శూద్రులై ఉండి బ్రాహ్మణుల మతనిష్టమీద యింతటి తిరస్కారం చూపుతారా చూస్తాగా... (నిష్క్రమణ)

(విశ్వేశ్వరి ప్రవేశం)

విశ్వే :-రమా ?

రమ :-ఏం పెద్దమ్మా ?

విశ్వే :-ఇలా మాట్లాడకుండా కూర్చున్నావేం తల్లీ...నిన్ను చూసి మనిషని యెవరంటారు ? అచ్చం మట్టిబొమ్మను యెవరో పోతపోసి పెట్టినట్లుగా ఉన్నావ్...(నెమ్మదిగా దగ్గరకువచ్చి కూర్చుని) ఆ నవ్వులేవు... ఆ ఆనందంలేదు...వదలి యెక్కడికో దూరంగా పారిపోయినట్లున్నాయి...

రమ :-(కొద్దిగా నవ్వి) ఇంతసేపూ యింట్లో యేంచేస్తున్నావ్ పెద్దమ్మా ?

విశ్వే :-నీ వ్రతాలయింట్లో పనికేంతక్కువ ? తినుబండారాలన్నీ పక్వాలుగా ప్రోగుచేసి ఉంచావ్.

రమ :-కాని యీసారి అన్నీ వృధాఅయిపోతాయ్...ఒక్క రైతుకూడా నాయింటికి దుర్గామాత ప్రసాదం తీసుకోవటానికి రానట్లుతోస్తోంది. కాని గడచిన యేళ్లసంగతి నీకు తెలుసుగా పెద్దమ్మా. ఈ సప్తమి రోజునే జనాన్ని తప్పుకుని యింట్లోకి వెళ్లటం కష్టమైపోయేది.

విశ్వే :-ఇప్పటికైనా వేళ మించిపోలేదు రమా. బహుశా అంతా సాయంకాలం వస్తారేమో...

రమ :-ఎవ్వరూరారు పెద్దమ్మా...

విశ్వే :-అందరూ యీమాటే అంటున్నారు. వేణీ, గోవింద కోపంతో ఊరు నాలుగుమూలలా కలయ తిరుగుతున్నారు. ఇంట్లో నీ పిన్ని తిట్లు చెవులతో, వినలేం కూడాను. కాని నీవద్దనుంచే ఏ ఫిర్యాదూ నేను వినటం లేదు. కోపమూలేదు... విచారమూలేదు... నీ కళ్ళవైపు చూస్తే, వాటివెనుక దుఃఖసముద్రము దాగిఉన్నట్లు కనబడుతోంది. అమ్మాయ్ నువ్వు యింతగా ఎలా మారిపోయావమ్మా ?

రమ :-పెద్దమ్మా...నేను ఎవరిమీద కోపగించను ? ప్రజలమీదనా ? కేవలం బీదవాళ్ళయినంతమాత్రాన, వారికి మానమర్యాదలు లేకుండా పోతాయా ? నా వంటి పాపాత్మురాలి ఆతిధ్యాన్ని వాళ్ళు ఎందుకు స్వీకరిస్తారు ?

విశ్వే :-బాగుందమ్మా.. నువ్వు పాపాత్మురాలివని ఎవరంటారు ?

రమ :-ఎవరైనా అనినా తప్పులేదమ్మా...వాళ్ళు మనవాళ్లుకారని, వాళ్ళంటే మనకు యిష్టంలేదని, వారికిందరికీ తెలుసు. పెద్దమ్మా, వాళ్ళనేం మనం ఆదరపూర్వకంగా పిలవలేదు. మన యింట్లో తిని పొమ్మని ఆజ్ఞాపించాం. పైగా వాళ్ళు రాకపోయేసరికి కోపంతో పిచ్చివాళ్ళమై పోతున్నాం. కాని వారికి ఆదరపురుచి తెలిసింది. ప్రేమంటేఏమిటో రమేశ్ వల్ల తెలుసుకున్నారు. వారి ఆ బంధువునే, మనం తప్పుడు కేసుపెట్టి దొంగసాక్ష్యాలు యిచ్చి జైలులో పెట్టిస్తే, ఆ దుఃఖాన్ని మాత్రం వారు ఎలా సులభంగా మరచిపోగల్గుతారు ?

విశ్వే :-కాని...అమ్మాయి నువ్వేం దొంగసాక్ష్యం యివ్వలేదుగా ?

రమ :-నేనేం దొంగసాక్ష్యం యివ్వలా ? ఎవరు అబద్ధమాడినా నేనుమాత్రం ఆడనని వారికి పూర్తిగా విశ్వాసం ఉండేది. కాని అబద్ధంఆడగల్గాను. మానలేకపోయాను. ఆచార్యులు చేసిన అపరాధం, కృతఘ్నపు కార్యాల వల్ల రమేశ్ ఎంతగా మండిపడిపోయారో నాకు తెలుసు. ఆఖరికి ఆయనచేతిలో ఆ సమయంలో గడ్డిపోచైనా లేదనికూడా బాగా తెలుసు. ఐనా కోర్టులో నిలబడి ఆయనచేతిలో కత్తిఉందా, లేదా అన్న విషయం జ్ఞాపకం తెచ్చుకోలేకపోయాను.

విశ్వే :-రమా—

రమ :-పెద్దమ్మా...నేను అబద్ధం ఆడలేదని అన్నావ్... ఇక్కడి కోర్టులో ప్రమాణం తీసుకుని నేను బహుశ అబద్ధం ఆడి ఉండకపోవచ్చు. కాని ఏ కోర్టులోఐతే ప్రమాణం తీసుకోవటం అంటూఉండదో...అక్కడ ఏం జవాబు చెప్పను ? భగవంతుడా... సత్యాన్ని మరుగుపరచటం యింతకష్టమని ముందేనాకు ఎందుకు తెలియనిచ్చావు కాదు ?

విశ్వే :-అమ్మాయి...రమేశ్ కు, శిక్షయితే పడినమాట నిజం...కాని అమంగళం యెన్నటికీ జరగదు.

రమ :-అమంగళం యెలా జరుగుతుంది పెద్దమ్మా ? అదంతా యివ్వాళవచ్చి నానెత్తిన పడిందిగా.

విశ్వే :-ప్రత్యేకంగా నీనెత్తిమీదనే వచ్చి పడలేదమ్మా...దానిలో భాగం మేమంతా పంచుకున్నాం...ఈ అసత్యపు సంఘంలోని యే పిరికివాళ్లయితే అబద్ధపు అపవాదు వేస్తామనే భయంచూపి నిన్ను నీచపరచారో

వాళ్ళతలలన్నీ యీ పాపపు భారంవల్ల దుమ్ములో కలిసిపోయాయి... నేను వేణీకి తల్లిని. రమా...యీ రోజున నాతలకూడా దుమ్ములో పొర్లాడుతోంది. ఎన్నటికి దానిని తిరిగి పైకి యెత్తలేను.

రమ :-అలా అనబోకు పెద్దమ్మా... కాని నేను ఏంచేశానో తెలుసా? ఒక జనశూన్యమైన దారిలో చీకటిలో వారిని ఒంటరిగా కలుసుకుని 'ఇక్కడ ఉండవద్దు రమేశ్... వెళ్లిపో ఇక్కడినుంచి వెళ్లిపో' అని నచ్చచెప్పాను. కాని వారు నన్ను విశ్వసించలేదు. పైగా దీనివల్ల నీకేం లాభం అని అడిగారు. నాకు లాభమా? అకస్మాత్తుగా కోపంవల్ల నేను పిచ్చిదానినైపోయాను. 'నాకు లాభమేమీలేదు. కాని వెళ్లక పోతే మాత్రం చాలా నష్టం కలుగుతుంది.' దుర్గపూజకు నా యింటికి ఎవ్వరూరారు. యతీంద్రుడి ఉపనయనంలో ఎవరూ నా యింట్లో భోజనంచెయ్యరు. మీరు యిక్కడవుండి నన్ను అన్నివిధాలా నాశనం చేయకండి అని అన్నాను. ఇంతటి అబద్ధాన్ని ఎక్కడినుంచి సంపాదించగల్గాను పెద్దమ్మా? ఇంతేనా అన్నారు కోపంతో...ఈ మాత్రానికే పనులు వదిలిపెట్టుకుని ఏమైనాసరే వెళ్ళనన్నారు. నన్ను యింతగా తృణీకరించారనే కోపంతో శిక్షపడితే పడిందిలే అని అనుకున్నాను. ఏదో మామూలుగా జుల్మానా పడుతుందనే నా విశ్వాసం...కాని ఆ శిక్ష యీ రూపేణా పడుతుందని, వారి రోగిష్టి మొగం చూసినప్పటికీ న్యాయాధికారికి దయకలగదనీ, యీ విధంగా జైలుకు పంపుతారనీ, ఎన్నడూ ఎంతటి చెడ్డకలలోకూడా అనుకోలేదు పెద్దమ్మా...

విశ్వే :-అవునమ్మా...నాకు తెలుసు...

రమ :-కోర్టులో కేవలం వారు నా మొగంవైపే చూస్తూఉన్నారని విన్నాను. వారి గోపాల్ గుమాస్తా అపీల్ చేద్దామన్నారుట... కాని ఆయనే వద్దన్నారు...జీవితమంతా జైలులో గడపవలసి వచ్చినా మంచిదే... కాని అపీల్ చేసి ముక్తిని పొందటంమాత్రం మంచిది కాదన్నారట. నివ్వేచెప్పు పెద్దమ్మా...నాకు యిది ఎంతటి మహాశిక్షో...?

విశ్వే :-కాని యిప్పుడు అతని శిక్షాకాలం ఐనా పూర్తికావచ్చిందికదమ్మా... విడుదలయి రావటానికి ఎంతోకాలం లేదు.

రమ :-వారికి విడుదలఉంది...కాని వారికి నా యందుఉండే అసహ్యాన్నుంచి నాకుమాత్రం విముక్తిలేదు.

(ముసలి సనాతన్‌ను వెంటబెట్టుకుని వేణీ ప్రవేశం)

వేణి :-ఇతను మనకు మూడుతరాలనుంచిర్రైతు. ముందునుంచి వెడుతున్నాడు పిలిచాను... ఇంటిలోపలికి వచ్చాడు. ఏంరా సనాతన్... ఇంతటి గర్వం ఎప్పుడుఎక్కింది? మెడమీద కొత్తగా తలఒకటి మొలిచిందా ఏం?

సనా :-రెండు తలలు మొండెంమీద ఎవరికుంటాయబాబూ? మీ లాంటి గొప్పవారికే ఉండకపోతే...మా బీదవాళ్ళకు ఉంటాయా?

వేణీ :-ఏమిట్రా అంటున్నావ్...వెధవా?

సనా :-పెదబాబూ...రెండుతలలు ఎవరికీ ఉండవ్... ఇదే చెపుతున్నా... ఇంకేంలేదు.

(గోవింద గంగూలీ ప్రవేశిస్తాడు)

గోవింద :-మీ పొగరు ఎంతవరకు ఉందా అనే మేమూ చూస్తున్నాం...దేవి ప్రసాదం తీసుకోవటానికి ఎవరూరారుగా? ఎందుకనిరారో చెప్పు?

సనా :-(నవ్వి) మాకేం పొగరు...మమ్మల్ని ఏం చెయ్యాలో మీరుచేసారు. ఆ విషయం వదిలేద్దాం... కాని దేవీప్రసాదం అవనీ, మరింకేమైనా కానీ, ఏకైవర్తుడుకూడా బ్రాహ్మలయింట్లో యిక భోజనం చెయ్యడు. ఈ భూదేవి యింతటి మహాపాపాన్ని ఎలా భరాయిస్తోందా అనే మే సప్పుడూ ఆలోచిస్తుంటాం (నిట్టూర్పువిడిచి... రమవైపుచూసి) అమ్మా కొంచెం జాగ్రతగా ఉండండి. పేరేపురపుమూతా పిచ్చివాళ్లయి పోయారు. ఇంతకు క్రితమే వాళ్లు పెదబాబు యింటిచుట్టూ నాలు గైదుసార్లు తిరిగి వచ్చారు. పెదబాబు దొరకకపోవటం మంచిదే అయింది. (వేణీవైపుచూసి) పెదబాబూ... కొంచెం జాగ్రతగా ఉండండి...రాత్రిపూట బయటకుమాత్రం రాకండి...

(వేణీ ఏదో చెప్పాలనుకుంటాడు. కాని భయంవల్ల నోటినుంచి మాటరాదు)

రమ :- (స్నేహపూర్వక కంఠస్వరంతో) సనాతన్ చినబాబును గురించేనా మీ కందరికీ యింతటికోపం వచ్చింది?

సనా :-అమ్మా... అబద్ధంచెప్పి నేను నరకానికి పోదలచుకోలేదు. సరిగా

అసలువిషయం అదేనమ్మా... షేర్‌పురపు వాళ్ళకి కోపంబాగా ఎక్కువగా ఉంది. వాళ్లు చినబాబుని దేవుడిలా పూజిస్తారు.

రమ :-(ఆనందంతో మొగం ఉజ్వలమవుతుంది) అలాగా...సనాతన్...

వేణీ :-(సనాతన్ చేయిపట్టుకుని) సనాతన్, పోలీసు యిన్‌స్పెక్టరుదగ్గరకు వచ్చి చెప్పు...నీకేది కావాలంటే అది యిస్తాను. నీ పొలం కావాలంటావా...అదీ వదిలేస్తాను. దేవుడుముందర ఒట్టువేసుకుని చెప్తున్నా...నువ్వు యీ బ్రాహ్మడిమాట నమ్ము...

సనా :-పెదబాబు... ఆ రోజులు వెళ్ళిపోయాయ్... ఆ కాలం గడిచిపోయింది. చినబాబు అంతా మార్చి మరీ వెళ్ళిపోయారు.

గోవింద :-ఐతే నువ్వు బ్రాహ్మణుడిమాటకూడా వినవన్నమాట...

సనా :-(తల అడ్డంగా ఆడించి) వినను... గంగూలీగారూ... నేను చెపితే మీకు కోపం వస్తుందేమో...కాని ఆ రోజున చినబాబు షేర్‌పూర్ కొత్తమ్మూలు గదిలో ఏమన్నారో తెలుసా... మెడలో రెండు మూడు జందెపుపోగులు వేసుకున్నంతమాత్రాన ఎవరూ బ్రాహ్మణుడవరన్నారు. అదీకాకుండా బాబూ... నేను యీ కాలపువాడ్ని కాదు. అన్నీ నాకుతెలుసు... మీరుచేసేవన్నీ బ్రాహ్మలుచేసే పనులేనా ? అమ్మా...మిమ్మల్నే అడుగుతున్నా...మీరైనా చెప్పండి.

(రమ మాట్లాడకుండా తలవంచుకుంటుంది)

సనా :-(లోపలి కోపాన్ని అణచిపెట్టుకుంటూ) కుర్రవాళ్లే ఎక్కువగా చేస్తున్నారు...ఈ రెండు ఊళ్ళల్లోఉన్న పిల్లలంతా, సాయంకాలం కాగానే, మోడల్ యింటిదగ్గర సమావేశ మవుతూంటారు. బహిరంగంగా...జమీందార్ అయితే చినబాబు ఒక్కరే జమీందార్... మిగతావాళ్ళంతా పచ్చిదొంగలు...అదీకాకుండా మేం శిస్తులు కడుతున్నాం...ఉంటున్నాం...ఒకళ్ళకు ఎందుకుజడవాలి ? ఎవరైనా బ్రాహ్మణులులాగా ఉంటే, వారే బ్రాహ్మణులు... లేకపోతే మేమెంతో...వారూఅంతే...అంటూ తిరుగుతున్నారు.

వేణీ :-(ఆత్రుతతో...)సనాతన్...నా మీదనే వాళ్ళకి ఎందుకింతకోపమో చెప్పగలవా ?

సనా :-పెదబాబూ...చెప్పలేకేం ? ఈ అనర్థాల కన్నింటికీ తమరే మూలమని అందరికీ పూర్తిగా తెలుసు...

(వేణీ భయంతో మాట్లాడలేకపోతాడు. లోపల గుండె దడదడ కొట్టుకుంటుంది)

విశ్వే :-సంగూలీ... ఒక తక్కువకులపు వాడి నోటివెంట యింతటి పొగరు మోతు మాట, వినికూడా, ఊరుకున్నావా ?

(వేణీ తీక్షణంగా కోపంతో చూసి మాట్లాడకుండా ఊరుకుంటాడు)

గోవింద :-ఆ...ఏంరా సనాతన్...నిపిన్ యింటిదగ్గరేగా...వీళ్లంతా సమావేశమయేది...వాళ్ళంతా, అక్కడ ఏం చేస్తుంటారో నువ్వేమైనా చెప్పగలవా ?

సనా :-ఏం చేస్తుంటారో తెలియదు... కాని బాబూ సుఖంగా ఉండాలనుకుంటే, దుర్మార్గపు ఆలోచనలు మరేంచేయబోకు. వాళ్ళంతా పిన్నా పెద్దా అందరూ కలిసిపోయారు. అందరిదీ ఒకటేఆలోచన... ఒకటే ప్రాణం...చినబాబుకు ఖైదుపడటంవల్ల కోపంతో మండిపడిపోతున్నారు. వాళ్ళ మధ్యకివెళ్ళి చెకుముకిరాయతో, నిప్పుమాత్రం రగుల్చొద్దు. నేను మీకుముందే చెప్పేస్తున్నా... (నిష్క్రమణ)

(సనాతన్ వెళ్లిపోయినతర్వాత అందరూ కొంచెంసేపు నిశ్శబ్దంగా ఉంటారు)

వేణీ :-రమా...విన్నావుగా సంగతి అంతా...?

(రమ నెమ్మదిగా నవ్వుతుంది. జవాబేమీయివ్వదు. ఆమె నవ్వు చూసి వేణీ వళ్లు మండుకుపోతుంది.)

వేణీ :-ఆ...ఆచార్యులు వెధవమూలాన్నే యింతగొడవ వచ్చిపడింది. నువ్వు కనక అక్కడికివెళ్లి వాడిని వదిలించి ఉండకపోతే, యిదంతా జరిగే ఉండేదికాదు. చస్తే వాడే చచ్చేవాడు...నీదేంపోయింది ?

(రమ మళ్లీ నవ్వుతుంది. కాని జవాబివ్వదు)

వేణీ :-రమా...నువ్వు నవ్వుతావ్... ఏమైనా ఆడదానివి .. ఇంట్లోనుంచి బయటకు రానక్కరలేదు. కాని మమ్మల్ని ఏం చెయ్యమంటావ్ ? ఒకవేళ ఎప్పుడైనా మా తలలు పగలకొట్టేస్తారేమో... ఆడవాళ్ళతో వ్యవహారంచేస్తే యిదేగతి పడుతుంది...

(రమ ఆశ్చర్యపోయి వేణీ మొగంవంక చూస్తూంటుంది)

వేణీ :-బాబాయ్...ఊరుకుంటే ఎలాజరుగుతుంది ? నా దర్వాన్ నౌకరులకు

కబురు పంపించు...రెండు లాంతర్లుకూడా తీసుకురమ్మను...

గోవింద :-పద...బయటికివెళ్లి కబురంపిస్తాను... ఐనా భయందేనికి? లేక పోతే నేనే నిన్ను యింటిదాకా పంపించివస్తాను...

(ఇద్దరి నిష్క్రమణ)

# 2

(స్థానం :—ఒకదారి... జగన్నాథ్... నరోత్తములు ప్రవేశిస్తారు. జగన్నాథ్ చేతిలో పెద్దలాఠీఉంటుంది)

నరోత్తమ్ :-ఇదేదారి...ఇలాగే వెడతాడు...జగ్గూ...ధైర్యం ఉందికదూ...

జగన్నాథ్ :-బాగుంది... ధైర్యం లేకపోవటమేం... శిక్ష అనుభవించటానికి సిద్ధపడే. ఒకరిని శిక్షించటానికి బయలుదేరాను. మనల్ని ఎంతో ఏడిపించాడు. దుర్గామాతా...చేయివలసినపని చేయగలిగేట్టుగా... నాకు శక్తి యివ్వు...నా చేతులు వణకకుండా దీవించు...

నరో :-ఏరా...చేతులు వణుకుతాయా?

జగ :-వణికితే వణకవచ్చు...తాతముత్తాతలనుంచి దెబ్బలుతినటానికే అలవాటుపడిఉన్నాకదూ...అందుకని చివరివరకు చేయి లేవకపోతే, తప్పంతా నా చేతిదే అనుకో...నాదిమాత్రం కాదు...

నరో :-సరే...ఐతే లాఠీ నా చేతికిచ్చి నువ్వు దూరంగా నిలబడు. నేను ఏం చెయ్యగలనో చూస్తాను...

జగ :-నరోత్తమ్...ఇలాంటిమాటలు అనకు...నీకు పిల్లాజెల్లాఉన్నారు. నాకా ఎవరూలేరు. ఇదే మంచిసమయం... చినబాబు తిరిగివస్తే యీ పని ఎన్నటికీ జరగదు. ఆయన ఆపుచేస్తారు. అందుకని ఆయన జైలునుంచి తిరిగి వచ్చేలోగానే, ప్రతీకారంచేసేసి నేను జైలులోకి వెళ్లిపోతాను. నువ్వు యింటికి వెళ్లిపో...

నరో :-ఇంటికి వెళ్లను...నీ దగ్గరనే ఉంటా...

(నరోత్తమ్ కొంచెం దూరంగావెళ్ళి నిలబడతాడు)

(రెండవవైపునుంచి వేణీ, గోవింద, దర్వాన్‌లు ప్రవేశిస్తారు దర్వాన్ చేతిలో లాంతరుంటుంది)

వేణి :-(ఉలిక్కిపడి) ఎవరురా...నిల్చున్నది ?

జగ :-నేను...జగన్నాథ్‌ని...

గోవింద :-దారిలో నిలబడి, భోజనానికి వెళ్ళొద్దని ప్రచారంచేస్తున్నావా ? ఏరా... వెధవా...

జగ :-గంగూలీగారు...తిట్లుమాత్రం తిట్టకండి...జాగ్రత...

వేణి :-తిట్టకూడదూ ? దొంగవెధవా... రేపే నీ యిల్లు పీకించిపారేసి, అక్కడ సాగుచేయిస్తా... తెలిసిందా...

జగ :-ఆ...చాలామంది కొంపలు పీకించి పారేశావని నాకు బాగా తెలుసు. కాని మళ్ళీ యిలాంటి పనిచేయకుండా యివ్వాళ తగిన ఏర్పాటు చేస్తాను.

వేణి :-ఏంరా గాడిదా...యేమిట్రా నువ్వుచేసేది...ఏర్పాటుట...ఏర్పాటు... ఏమిటా ఏర్పాటు ? (కొంచెం ముందుకువస్తాడు)

జగ :-ఇదిగో...ఇదే... (వేణీతలమీద లాఠీపుచ్చుకుని గట్టిగా కొడతాడు)

వేణీ :-(కూలబడిపోతాడు) బాబోయ్...చచ్చాను...

(గోవింద, దర్వాన్ గట్టిగా అరుస్తూ పారిపోతారు)

వేణీ :-నాయనా జగన్నాథ్...నీ కాళ్ళకు మొక్కుతాను. బ్రాహ్మణ్ణి నన్ను హత్యమాత్రం చెయ్యకు...నీకు పుణ్యముంటుంది... పదిసెంట్లు భూమి కూడా యిచ్చుకుంటాను.

జగ :-నీ పొలంయేమీ నా కక్కరలేదు...నీ దగ్గరనే ఉంచుకో... బ్రాహ్మణ హత్యకూడా చెయ్యనులే...

వేణీ :-జగన్నాథ్...ఇవ్వాళ్టినుంచి నీకునాకు తండ్రీ కొడుకుల సంబంధం యేర్పడింది. నువ్వు యే దడిగితే, అది—

జగ :-నాకేం అక్కరలేదు...ఐనా తండ్రీకొడుకుల బాంధవ్యమా...నీతోనా ? రామ...రామ...ఇదే ఆఖరుదెబ్బని మాత్రం అనుకోకు...యజమానివని బ్రాహ్మణుడవనీ, యెంతసహించినా...నీ అత్యాచారాలకేం, అంతం

కనబడటంలేదు. రోజు రోజుకు పెరిగిపోతున్నాయ్... యికమేం సహించలేం...మీకు యిక బుద్ధివస్తుందో లేదో చూస్తాగా ..

(నిష్క్రమణ)

వేణీ :-బాబోయ్...చచ్చానురా...అంతా పారిపోయారుర్రా...

(గోవింద, దర్వాన్ వస్తారు)

గోవింద :-(వగరుస్తూ) ఎందుకు పారిపోతాం బాబూ...పారిపోలా... నలుగుర్ని పిలుచుకువద్దామని పరుగెత్తుకు వెళ్లాను. జగ్గా వెధవ యెలాంటి రౌడీయో చూశావుగా... వెధవమీద దోపిడీచేసినట్టుగా కేసుపెట్టి ఐదేళ్ళు జైలుకు పంపించకపోతే నా పేరు గోవిందగంగూలే కాదు...

దర్వాన్ :-(వగరుస్తూ) చేతిలో ఏదైనా కత్తిఉన్నట్లయితే నా...

వేణి :-ఏడిశావ్...పోరా వెధవా...మహాపొడిచేశావులే... (తలతడిమి చూసుకుని) బాప్‌రే...యెంత నెత్తురుకారుతోంది...ఇక బ్రతకను.

(క్రిందపడిపోతాడు).

గోవింద :-(పట్టుకుని లేవదీయాలని ప్రయత్నంచేస్తూ...)అరే... బ్రతుకుతావ్ బాబూ...నిన్ను స్వయంగా కలకత్తా హాస్పిటల్‌కు తీసుకువెడతాను (దర్వాన్‌తో) అరె...కొంచెం పట్టుకోరా...పిరికివెధవా... నక్కలా పారిపోయావ్ భయమేసి...

దర్వాన్ :-చేతిలో కత్తిలేకుండా యేంచేసేదిబాబూ...

(ఇద్దరూ వేణీని మోసుకుని పోతారు)

# 3

(రమ పడకగది. జబ్బుతో ఉన్న రమ మంచంమీదపడుకుని ఉంటుంది. ఎదురుగా కిటికీలోనుంచి, ప్రాతఃకాలపు యెండ లోపల పడుతూంటుంది. విశ్వేశ్వరి ప్రవేశిస్తుంది.)

విశ్వే :-(దుఃఖాన్ని దిగమ్రింగుకునే కంఠస్వరంతో) ఏంఅమ్మాయ్...రమా... ఇవాళ ఒంట్లో యెలావుంది ?

రమ :-(కొద్దిగానవ్వి) పెద్దమ్మా...బాగా నేఉంది...

విశ్వే :-రాత్రి జ్వరం తగ్గిపోయిందా ?
రమ :-లేదమ్మా... కాని తొందరగాఒకరోజున తగ్గిపోయిందనుకుంటున్నాను.
విశ్వే :-దగ్గు...?
రమ :-ఇంకా అలానే ఉంది...
విశ్వే :-ఐనప్పటికీ...వంట్లోబాగానే ఉందని అంటున్నావా అమ్మాయ్...

(రమ మాట్లాడకుండావున్నతుంది. విశ్వేశ్వరి ఆమె తలవద్దకూర్చుని తల నిమురుతూంటుంది)

విశ్వే :-అమ్మాయ్...నీ నవ్వుచూస్తే...చెట్టునుంచి పువ్వు రాలిపోయి దేవుడి పాదాలముందు పడి నవ్వుతూన్నట్లుగాఉంది...అమ్మాయ్ ?
రమ :-యేం పెద్దమ్మా ?...
విశ్వే :-నేను నీకు తల్లితో సమానమైనదానిని రమా...
రమ :-పెద్దమ్మా...తల్లితోసమానమేమిటి ? నువ్వు నా తల్లివేనమ్మా...
విశ్వే :-(వంగి రమ నుదురు ముద్దుపెట్టుకుని) ఐతే అమ్మా... నిజంచెప్పు... నువ్వు యిలా ఎందుకయావమ్మా...
రమ :-జబ్బుగాఉంది పెద్దమ్మా...
విశ్వే :-(రమ తల చేతితో నిమురుతూ) దీనిని నేను యీ చర్మపుకళ్లతో చూస్తూ నేఉన్నానమ్మా...ఒకవేళ వీటితో చూడలేనివిషయం ఏదైనా ఉంటే దానిని నీ యీ అమ్మదగ్గర దాచకు...దాచినందువల్ల గోరం నయంకాదమ్మా...
రమ :-(కొంచెం సేపటివరకు కిటికీలోనుంచి, మాట్లాడకుండా బయటికిచూసి) పెద్దన్నయ్యకు ఎలావుందమ్మా ?
విశ్వే :-తలమీది గాయం మానటానికి యింకా కొంతకాలం పడుతుందమ్మా, కాని ఆసుపత్రినుంచి ఐదారురోజులలో యింటికి వచ్చేస్తాడు. అమ్మాయ్ నువ్వు విచారించకు అదివీడికి జరగాల్సిందే...దీనివల్ల వాడికి మేలేజరుగుతుంది. కొడుకుకు యింత ఆపదవచ్చినప్పటికీ, తల్లినై యుండి నేను యిలా ఎలాఅనగల్గుతున్నానా అని నువ్వు బహుశా అనుకుంటూ ఉండవచ్చు...కాని నీకు నిజంచెపుతున్నా... దీనివల్ల నాకు బాగా కష్టమేకల్గిందో...ఆనందంకల్గిందో చెప్పలేను. అధర్మం అంటే భయపడనివాళ్ళకి, సిగ్గులేనివాళ్ళకి ప్రాణాలమీద ఇంత తీపి

యీ ప్రపంచం మన్నులో కలిసిపోయి ఉండేదే...అందుకనే రమా... ఆ రైతులకుర్రాడు వేణికి చేసినంతమేలు యే ఆత్మీయుడుకూడా చేసి ఉండడేమోనని మనస్సులో పదేపదేఅనుకుంటూ ఉంటాను. అన్యాయ కడిగినంతమాత్రాన బొగ్గునలుపు పోదు...దానిని నిప్పులో కాల్చవలసి ఉంటుంది...

రమ :-కాని పెద్దమ్మా...మొదట్లో యిలాగేవుండేది కాదుగా...ఈ రైతుల్ని యెవరు యిలా తయారుచేశారు ?

విశ్వే :-వీళ్ళ ఉత్సాహాన్ని యింతగా పెంపొందింపచేసింది యెవరో నీకు మాత్రం తెలియదుటమ్మా ?...జైలులో పడవేస్తేచాలు అన్నితగాదాలు తీరిపోతాయనుకున్నారు. కాని నిప్పు రగుల్కొల్పితే, సులభంగా ఆరిపోదనిమాత్రం వాళ్ళు తెలుసుకోలేక పోయారు. బలవంతగా ఆరిపేయ దలచుకుంటే, ప్రక్కనున్న వస్తువుల్ని మాడ్చేస్తుంది.

రమ :-కాని పెద్దమ్మా...ఇదేం మంచిపనా ?

విశ్వే :-అమ్మాయి...మంచిదేనమ్మా...ఘోర అత్యాచారం చేయాలనే ప్రబల వాంఛ ఒకవైపు...నిరుపాయులైన ప్రజలు సహించగల్గిన అవిచ్ఛిన్న పిరికితనం, మరొకవైపు...ఈ రెండింటనీ వాడు సమన్వయపరిచి ఉండినట్లయితే బాగానే ఉండేది. అమ్మాయి...వేణిస్థితిచూసి నేను యిన్నటికీ నిట్టూర్చును. కాని నా రమేశ్ సుఖంగా తిరిగివచ్చి, కలకాలం బ్రతికి, యీ విధంగానే తనపని చేస్తూండాలని ప్రార్థిస్తున్నాను. రమ...ఏకైక సంతానంఅంటే యేమిటో, కేవలం తల్లికే తెలుస్తుంది. నెత్తురుతో తడిసి ముద్దయిన వేణిని, పల్లకీలో యెక్కించి, ఆసుపత్రికి తీసుకునివెళ్ళినపుడు నాస్థితి యెలావుందో నీకేవిధంగాను తెలియచెప్పలేను. ఐనప్పటికీ, నేను యెవర్నీ నిందించలేనుకూడా...ధర్మం...తల్లి ముఖంచూసి దండనయివ్వకుండా ఊరుకోదన్న విషయంకూడా నేను యెన్నటికీ మరిచిపోలేనమ్మా...

రమ :-నీతో నేను వాదించను పెద్దమ్మా...ఒకవేళయిదే సరియైనదయేటట్లయితే, రమేశ్ యే పాపం కారణంగా యీ దుఃఖాన్ని అనుభవిస్తున్నారు ? మేమంతా యేమేమిచేసి ఆయన్ని జైలుకు పంపామో... అవి యెవరిదగ్గరా దాగిలేవుగా ?

విశ్వే :-దాగిలేవు కనుకనే...యీ రోజున వేణి ఆసుపత్రిలో ఉన్నాడు...

యిక నీస్థితంతా— అమ్మాయ్... యీ విషయం మాత్రం జ్ఞాపకం ఉంచుకో...ఏపనీకూడా యెన్నటికీ నిష్ఫలమైపోయి శూన్యంలో కలిసిపోదు. దానిశక్తి యెక్కడికైనాసరే వెళ్ళి తనపనిని తాను చేస్తుంది. కాని యేవిధంగా చేస్తుంది అన్న విషయం... ప్రతిసారీ అందరికీ తెలియదు. అందువల్లనే యింతవరకుకూడా, ఒకడుచేసిన పాపానికి మరొకరు ప్రాయశ్చిత్తం చేసుకోవలసిన అవసరం యెందుకు కల్గుతోంది అనే విషయమై మీమాంస తేలలేదు. కాని రమా...ప్రాయశ్చిత్తం చేసుకోవాలి అన్నదానికి సందేహంలేదు.

(రమ మాట్లాడకుండా నిట్టూర్పు విడుస్తుంది)

విశ్వే :-అమ్మాయ్...ఈ సంఘటనతో నాకళ్ళు తెరచుకున్నాయ్...కేవలం ఒకరికి మేలుచేయాలన్న అభిప్రాయం ఉన్నంతమాత్రాన, యీ ప్రపంచంలో మేలుచేయటం జరగదు. మొదట్లో చిన్నవీ, పెద్దవీ నొప్పులు దాటిపోయే ధైర్యం ఉండాలి. ఒకసారి రమేశుడు విసుగెత్తిపోయి యిక్కడినుంచి వెళ్ళిపోవటానికి తయారయాడు. కాని వాడిని నేనే వెళ్ళనివ్వలేదు. అందువల్లనే వాడు జైలుకు వెళ్ళాడని తెలియగానే, వాడిని నేనే జైలుకు పంపించానాఅని, నాకు మనస్సులో...ఒకబాధ కలిగింది ఒక్కసారిగా బయటినుంచి పరుగెత్తుకువచ్చి, మంచిచేయటంలో యెంత ఆపదవుందో ఆసమయంలో తెలుసుకోలేకపోయాను. మంచి చేయదలచటంకూడా యెంతో కష్టం...

రమ :-ఏం పెద్దమ్మా...కష్టం యెందుకని ?

విశ్వే :-పదిమందితో కలిసి ఒకటవాల్సి ఉంటుందని ఆసమయంలో ఆలోచించనే లేకపోయాను. మొదటినుంచీ వాడు యెంతో ఆవేశంతో... యెక్కువ జీవశక్తితో...ఉన్నతస్థానంలో నిలబడ్డాడు...ఎవ్వరూ కూడా వాడదగ్గరికి చేరలేకపోయారు—పొందలేకపోయారుకూడా. కాని యిప్పుడు వాడిని క్రిందకుదింపి భగవంతుడు మంచే చేశాడనుకుంటున్నాను.

రమ :-భగవంతుడుకాదు పెద్దమ్మా...ఆపనిచేసింది మేము. కాని మాఅధర్మం ఆయన్ని క్రిందకు యెందుకు తీసుకువస్తుంది ?

విశ్వే :-ఎందుకు తీసుకురాదు అమ్మాయ్...? లేకపోతే పాపం యింత భయంకరంగా యెందుకుంటుంది? ఉపకారానికి బదులు ప్రత్యుపకారం

చేయకపోగా...అపకారం చేసినప్పుడు...మానవుడి కృతఘ్నత దాటిను క్రిందకుయీడ్చి లాగుకురాకపోతే, మరింకేం చేయగల్గుతుంది ? రమా, నీవు యిన్ని అంటున్నావ్...కాని మీవూరు రమేశుడ్ని మొదటిమాదిరి గానే తిరిగి పొందగల్గుతుందా ? ఏ చేతులతోనయితే వాడు యింత వరకు నలుగురికి మేలుచేస్తున్నాడో, ఆ చేతుల్ని భైరవాచార్యులు— ఒక్క భైరవాచార్యులేం ఖర్మం...మీరంతాకలిసి విరగకొట్టేశారు... ఈ విషయాన్ని మీరంతా స్పష్టంగా తెలుసుకోగల్గుతారులే...ఇది కూడా సరిగా జరగలేదని యెవరనగలరు ? వాడి బలిష్ఠమైన చేతుల నుంచి వచ్చే అపర్యాప్తదానాన్ని గ్రహించేశక్తి ప్రజలలోలేనప్పుడు, వాడి విరిగినచేతులే ఆ ప్రజల అసలు కార్యానికి ఉపయోగపడుతాయ్

(విశ్వేశ్వరి నిట్టూర్పు విడుస్తుంది. రమ కొంచెంసేపటివరకు తనచేతిని యిటూఅటూ ఆడిస్తుంది...తర్వాత నెమ్మదిగా నిట్టూర్చుతుంది)

రమ :-పెద్దమ్మా...

విశ్వే :-ఏం తల్లీ...

రమ :-అపకీర్తి, తిరస్కారం, ఇప్పుడు నాదగ్గరకిచేరవు పెద్దమ్మా...అబద్ధ సాక్ష్యంయిచ్చి ఆయన్ని జైలుకుపంపిన రోజునుంచీ, ప్రపంచంలోని బాధఅంతా నాకు పరిహాసంగా తయారయింది.

విశ్వే :-అలాగే జరుగుతూంటుందమ్మా...

రమ :-ఏవిధంగానైనాసరే శత్రువును అణగద్రొక్కటంలో దోషం యేమీ లేదని వాళ్ళంతా అన్నారు...ఆపనేచేశారు...కాని నేను యీవిధంగా ఫిర్యాదు చేయలేను పెద్దమ్మా...

విశ్వే :-ఎందుకని చేయలేవమ్మా ?

రమ :-నేను చేయలేను పెద్దమ్మా...ఒక్కవిషయాన్ని యివ్వాళే నీవద్ద ఒప్పు కుంటున్నాను. మోడల్ యింటిదగ్గర కుర్రవాళ్లంతా సమావేశమై. రమేశ్ చేసిన ఉపదేశానుసారంగా మంచిగానే ఆలోచించుకుంటు న్నారు. వాళ్ళని గూండాలదళం అనిచెప్పి పోలీసులకు పట్టించటానికి ఒకకుట్ర జరుగుతోంది. నేను మనిషినిపంపి ముందుగా వాళ్ళకు యీ విషయమై కబురు తెలియచేశాను. పోలీసులుకూడా వాళ్లని పట్టు కోవాలనే అనుకుంటున్నారు. ఒకసారికనుక వాళ్ళు పోలీసులచేతిలో పడ్డారా...ఇక యేమనుకున్నా ప్రయోజనంలేదు...

విశ్వే :-(వణుకుతూ) ఏమిటమ్మా అంటున్నావ్ ? పోలీసుల్ని తన ఊరిలోకి పిలిపించి వేణీ ఊరికే వాళ్ళచేత దౌర్జన్యం చేయించాలనుకున్నాడా ?

రమ :-పెద్దన్నయ్యకు కలిగినశిక్ష దీని ఫలితమేనని నాకు తోస్తోంది... పెద్దమ్మా...నన్ను క్షమించవ్ ?

విశ్వే :-వాడి తల్లినైనప్పటికీకూడా నేను క్షమించకపోతే, ఇంకెవరు క్షమిస్తారమ్మా ? భగవంతుడు దీనికి నీకు బహుమానం యిస్తాడని ఆశీర్వదిస్తున్నా...

రమ :-(చేతితో కన్నీరు తుడుచుకుంటూ) వారు జైలునుంచి తిరిగిరాగానే తన కళ్లతో తన ఆనందక్షేత్రం తయారయి ఉండటంచూసి ఆనందిస్తారనేదే...నాకు ఊరటను కలిగిస్తోంది. వారు యేది కోరుకున్నారో అదే అయింది. వారి యీ దేశపు దీనప్రజలే నిద్రనుంచి మేల్కొన్నారు. వారిని గుర్తించారు—ప్రేమించారు. ఈ ప్రేమవల్ల కలిగే ఆనందంలో నన్ను వారు క్షమించరూ ? పెద్దమ్మా...ఒక్క విషయంలో మేమిద్దరం మారనైనాపోలేము...ఇద్దరం నిన్ను ప్రేమిస్తూనేవున్నాం...

(విశ్వేశ్వరి మాట్లాడకుండా ఆమెగడ్డాన్ని ముద్దుపెట్టుకుంటుంది)

రమ :-ఆ భరోసాతోనే నిన్ను ఒక్కటి కోరుతున్నాను. నేను యిక యీ ప్రపంచంలో లేనిసమయంలోకూడా వారు నన్ను క్షమించలేకపోయినట్లయితే నాతరఫున కేవలం వారితో యీమాటలు చెప్పు... నేనెంత చెడ్డదానినని వారు అనుకుంటున్నారో... అంతటి దుర్మార్గురాలను కాదని మాత్రం చెప్పు...వారిని యెంతగా దుఃఖపెట్టానో...అంతకంటె యెక్కువగానే నేనూ దుఃఖాన్ని అనుభవించాను. నీ నోటివెంట యీమాటలు వింటే వారు నమ్మవచ్చు...

విశ్వే :-ఐతే పదమ్మా...మనం యెక్కడికైనా తీర్థయాత్రలకు పోదాం... రమేశ్, వేణీ లేనిచోటుకు, కళ్లుతెరవగానే దేవుడిగుడిశిఖరం కనబడే చోటికి పోదాం... రమా... నేను అన్నివిషయాలు గ్రహించాను. అమ్మాయి...నువ్వు వెళ్లేరోజే ఒకవేళ సమీపించినట్లయితే, నేను యీ విషాన్ని హృదయంలోకి ఉంచుకునిమాత్రం వెళ్లలేను...అంతా యిక్కడనే దిగవిడిచిపోతాను. ఏం అమ్మాయి...ఇలా చేయగలవా ?

రమ :-(విశ్వేశ్వరి ఒడిలో తలపెట్టుకుని భోరున యేడుస్తుంది) ఇదంతా నేను సహించలేను పెద్దమ్మా...నన్ను యిక్కడినుంచి తీసుకుపో...

# 4

(స్థానం :-జైలుముందు దారి. ఒకవైపునుంచి రమేశ్, మరొక వైపునుంచి వేణీలప్రవేశం. వేణీ తలకు కట్టుకట్టిఉంది. ఆయన వెంట స్కూలు హెడ్మాస్టరు వనమాలి, కొంతమంది విద్యార్థులు ఉంటారు...వెనుక వేణీ సహచరులు...ఇద్దరు ముగ్గురు మనుష్యులు ఉంటారు.)

వేణీ :-(రమేశ్‌ను కౌగలించుకుని) తమ్ముడూ...తన స్వంత రక్తంఅంటే ఎంత ఆకర్షణ ఉంటుందో ఇప్పుడు గ్రహించగల్గాను. రమ ఆ ఆచార్యులు వెధవని తనచేతిలో యిరికించుకుని యీ విధంగా విరోధం వహిస్తుందని, సిగ్గూశరంలేకుండా అన్నీ వదిలేసి స్వయంగావచ్చి తప్పుడుసాక్ష్యం యిచ్చి యింతటి కష్టాన్ని కలిగిస్తుందని తెలుసుకోగల్గి ఉండికూడా ముందుగా తెలుసుకోలేకపోయాను. భగవంతుడు దీనికి నాకు శిక్ష కలుగజేశాడు. తమ్ముడూ...జైలులోఉండి నువ్వుబాగానే ఉన్నావ్ ...కాని బయటఉండికూడా నేను యిన్నాళ్ళనుంచి ఊకిమంటలో మాడిపోతున్నాను.

(రమేశ్ నిశ్చేష్టుడై నిలబడిపోతాడు. ఏం చేయాలో అతనికేమీ తోచదు. వనమాలి, విద్యార్థులు ముందుకువచ్చి అతనిపాదాలకు నమస్కారం చేస్తారు.)

వేణీ :-(ఏడుస్తూ) తమ్ముడూ...నువ్వు పెద్దన్నయ్యమీద కోపగించుకోకు... పద...యింటికిపోదాం...అమ్మ ఏడ్చి ఏడ్చి కళ్లురెండూ పోగొట్టుకోవటానికి తయారయింది... రమేశ్... మాకిందరికీ కేవలం ప్రాణాలు మాత్రమే మిగిలున్నాయ్...

రమే :-(వేణీతలపై కట్టునుచూపిస్తూ) పెద్దన్నయ్యా ఇదేమిటి ? మీ తల ఎలా పగిలింది ?

వేణీ :-విన్నందువల్ల ఏం లాభం తమ్ముడూ ? ఎవర్నీ ఏమీ తప్పుపట్టను. మొదటినుంచీ నాలోఉండే ఒకదోషం నీకుతెలుసుగా...మనస్సులో ఒకమాట ఉంచుకుని పైకి ఇంకోమాట చెప్పటం నాకు సులేరాం యిష్టంఉండదు. అందరిమాదిరిగా మనసులోమాట మనసులోనేదాచు

కుని ఉండలేను. అందుకనే నేనుఎన్నో దెబ్బలు తినవలసివస్తుంది. ఐనా నాకళ్ళు, తెరచుకోలేదు. నా కోపం కేవలం యిదే నాయనా... ఆ రోజున యేడ్చియేడ్చి రమతో యిలా అనేశాను... రమా నేను నీకేం అపకారం చేశానని, నా తమ్ముడ్ని జైలుకు పంపించావ్... జైలుకు వెళ్ళాడని మాటవింటేనే చాలు అమ్మప్రాణాలు వదిలేస్తుంది. అన్నా తమ్ములం మేము ఆస్తికోసం తగవులాడుకుంటేనేం... యేమైనావాడు నా తమ్ముడే...నువ్వు ఒక్కదెబ్బతో...తమ్ముడ్ని చంపావ్...అమ్మనూ చంపావ్ అన్నా...రమేశ్ ఆ రోజున రమయొక్క ఉగ్రఆకారాన్ని దలచుకుంటే, యిప్పటికీ గుండెకొట్టుకుంటుంది. ఏమన్నదో తెలుసా ? రమేశ్ తండ్రీ మా నాన్నను జైలుకు పంపాలనుకోలేదా...ఐతే పంప కుండా వదిలెయ్యమంటావా అంది.

రమే :-ఆ...రమ పిన్ని, నోటివెంటకూడా యీ మాటవిన్నాను.

వేశీ :-ఇది వాళ్ళ వంశానికున్న పగేరా నాయనా... కాని ఆడదానికిగల యీ అహంకారాన్ని నేను సహించలేకపోయాను. నేనూ కోపంతో, వాడిని జైలునుంచి తిరిగిరానీ, చూస్తానులే అని అనేశాను, కాని తమ్ముడూ...ఖూనీచెయ్యటం దానికి అలవాటే... నిన్ను ఖూనీచెయ్య టానికి అక్బర్ వస్తాదును పంపిన విషయం జ్ఞాపకంలేదూ...కాని నీ దగ్గర వాడి ఆటలేం సాగాయికావు. వాడికి బాగా బుద్ధిచెప్పావ్... కాని నన్ను ఖూనీచేయటం యేమంత కష్టం ?

రమే :-తరువాత ఏమయింది ?

వేశీ :-దీనితరువాత ఏం జరిగిందో నాకుమాత్రం జ్ఞాపకంయేడిసిందా ?...యే విధంగా నన్ను హాస్పిటల్ కు తీసుకువెళ్లిందీ, అక్కడ ఏంజరిగిందీ... యెవరుచూసిందీ...నాకేం తెలియదు. ఈసారి నేను బ్రతికానూఅంటే కేవలం అమ్మచేసిన పుణ్యం మూలాన్నే... ఇలాంటితల్లి యింకెవరి కుంటుంది రమేశ్ ?

(రమేశ్ మనస్సులోను, మొగంమీద యేమేమి జరుగుతూందో లెక్కలేదు—అతను ఒక్కమాటకూడా మాట్లాడలేదు)

వేశీ :-తమ్ముడూ... బండి తయారుగాఉంది...ఇక ఆలస్యం చెయ్యకు. పద యింటికిపోదాం. నిన్ను తీసుకువెళ్లి అమ్మదగ్గర చేర్చానూ అంటేనాకు విశ్రాంతిగా ఉంటుంది.

రమే :-పోదాం...నడవండి... రమకు చాలా జబ్బుగా ఉందని జైలులోనే తెలిసింది.

వేణీ :-రమేశ్...భగవంతుడి దండన యిది నాయనా...ఇదంతా ఆ దేవుడి సామ్రాజ్యమనే విషయం అందరికీ జ్ఞాపకంఅంటూ ఉంటుందా ? పద తమ్ముడూ...యింటికి పోదాం... (అందరూ నిష్క్రమిస్తారు)

# 5

(రమగది. రమేశ్ ప్రవేశిస్తాడు. ఆమెనుచూసి ఉలిక్కిపడతాడు)

రమే :-నీకు జబ్బు యింత యెక్కువగా వుందని అనుకోలేదు.

(రమ అతి కష్టంమీద లేచి కూర్చుంటుంది. రమేశ్ పాదాలవైపు వంగి నమస్కారం చేస్తుంది)

రమే :-ఇప్పుడెలావుంది రాణీ ?

రమ :-నన్ను రమా అనే పిలవండి...

రమే :-సరే...నీకు జబ్బుగావుందని విన్నాను. ఇప్పుడెలావుందో తెలుసుకుందామనే నాకోరిక. కాకపోతే నీపేరు యేదైనా ఆపేరుతో పిలవాలని నాకు కోరికాలేదు...అవసరమూలేదు...

రమ :-ప్రస్తుతం బాగానే ఉన్నాను. నా కబురువిని ఆశ్చర్యపోయానను కుంటూ...కాని...

రమే :-ఆశ్చర్యం ఏం కలగలేదు. నువ్వు యెపనిచేసినా ఆశ్చర్యపోయేరోజులు గతించి పోయాయి...నన్నెందుకు పిలిపించావో చెప్తావా ?

రమ :-(కొంచెంసేపు తలవంచుకుని మాట్లాడకుండా కూర్చుని) రమేశ్... ఇవ్వాళ రెండుపనులకోసం మిమ్మల్ని కష్టపెట్టాను. మీపట్ల ఎంతటి అపరాధంచేశానో నాకుతెలుసు. ఐనప్పటికీ మీరు తప్పకుండా వస్తారని, నా యీ అంతిమ కోర్కెలను రెండింటినీ స్వీకరిస్తారని నాకు నమ్మకంవుంది. (ఏడుపువల్ల కంఠస్వరం వణుకుతుంది)

రమే :-ఏమిటా కోర్కెలు ?

రమ :-(చకితురాలై తల ఒకసారి పైకెత్తి మళ్లీ క్రిందకు దించుకుంటుంది) పెద్దన్నయ్య ఘోరసహాయంతో, వశంచేసుకోదలచుకున్న ఆ పీర్‌పురంపు

ఆస్తి నా స్వంతం. నాన్న రివాజుప్రకారం నాకే యిచ్చివెళ్లారు. అందులో పదిహేనణాలభాగం నాది. ఒక అణావంతు మీది. ఆ ఆస్తినే మీరు నేను యివ్వదలచుకున్నాను.

రమే :-నువ్వేం భయపడకు. పెద్దన్నయ్య నాతో యేం చెప్పినా, దొంగతనం చేయటంలో యింతకుముందు నేను ఎవరికీ సహాయంచేయలేదు...ఇక ముందు చెయ్యకూడా... నువ్వు దానమే చేయాలనుకుంటే, దానికి యెంతోమంది ఉన్నారు. నేనేం దానాన్ని స్వీకరించను.

రమ :-దొంగతనంచేయటంలో మీ రెవ్వరికీ సాయంచేయరని నాకు తెలుసు. అవీకాకుండా ఒకవేళ తీసుకున్నా మీ స్వంతానికి తీసుకోరనికూడా తెలుసు. కాని విషయం అదికాదు. తప్పుచేసినప్పుడు దండన జరుగుతుంది. నేనుచేసిన అపరాధాలకు దండనరూపకంగా ఇదెందుకు తీసుకోకూడదు ?

రమే :-ఇకనీ రెండవ కోరిక ?

రమ :-నా యతీంద్రుడ్ని మీకు వప్పగించి పోతున్నాను.

రమే :-వప్పగించి పోతున్నావా ? అంటే దీనిఅర్థం ?

రమ :-(రమేశ్ మొగంవంకచూసి) రమేశ్... ఒకనాటికి దీని అర్థంకూడా మీకు తెలియకుండా దాగిఉండదు. అందుకనే నా యతీంద్రుడ్ని మీకు వప్పగించి పోతాను. వాడికి మీలాగే చదువుసంధ్యలు నేర్పి, వాడు పెద్దవాడయినతర్వాత మీలాగే స్వార్థత్యాగంచేయకలిగేట్టుగా తయారుచేయండి. (కొంగుతో కన్నీరు తుడుచుకుని) దీనిని నేను నా కళ్ళతో చూడలేను. కాని యతీంద్రుడిలో వాడి పూర్వుల రక్తం ఉందని నాకుతెలుసు. వాడికి సరిగా చదువుసంధ్యలు చెప్పిస్తే, వాడి అస్థికలలోకలిసి ఉన్నత్యాగశక్తి, వాడిని ఒకానొకరోజున మీ లాగే తల యెత్తుకుని తిరిగేట్టు చేయగలుగుతుంది.

(రమేశ్ మాట్లాడకుండా ఊరుకుంటాడు)

రమ :-రమేశ్...యీ విధంగా మాట్లాడకుండా ఊరుకుంటే యివ్వాళ మిమ్మల్ని వదలిపెట్టను.

రమే :-ఇదిగో...నన్ను యీ వ్యవహారాలలోకి యీడ్చకు. ఎంతో దుఃఖాన్ని అనుభవించి, ఈ మాత్రపు వెలుతురును యేర్పరచుకోగలిగాను. అందుకనే అది కొద్దికాలంలోనే ఆరిపోతుందేమోనని నాకు మాటిమాటికి

భయం వేస్తూంటుంది.

రమ :-భయపడవలసిన అవసరం యేమీలేదు. ఈ వెలుతురు యిక ఆరిపోదు. పెద్దమ్మఅంది—మీరు యెంతోదూరంనుంచివచ్చి, ఎక్కడో ఉన్నత ప్రదేశంలోకూర్చుని పనిచేయాలనుకున్నారట. అందుకనే మీ పనులకు యిన్ని ఆటంకాలు. కల్గాయి...ఆ సమయంలో మీరు పరాయివాని మాదిరిగా పల్లె సమాజానికి బయటవున్నారు. ఇప్పుడు దానిలో ఒక వ్యక్తి అయిపోయారు. ఆ సమయంలో మీరిచ్చినది ఒక విదేశీయుని దానం...ఇప్పుడదీ ఒక ఆత్మీయుని స్నేహపూర్వకపు కానుక. ఇప్పుడు మీరు దుఃఖాన్ని పొంది దానికి సహించేచోటలేరు. అందుకనే ఇప్పుడు ఆ వెలుతురు మందగించదు...రోజురోజుకు ఉజ్వలమై పోతుంది...

రమే :-మన యీ దీపప్రకాశ యిక ఆరిపోదని నీకు బాగా తెలుసు రమా?

రమ :-అ...పూర్తిగా తెలుసు. ఇది సర్వం తెలిసిన ఆ పెద్దమ్మ చెప్పినమాటే... ఈ పనిచేసింది మీరే...నా యతీంద్రుడ్ని మీ ఆశ్రయంలోకి తీసుకోండి. నా తప్పులన్నీ క్షమించండి. నిశ్చింతగా వెళ్ళమని నన్ను ఆశీర్వదించండి...

రమే :-రమా...నువ్వువెళ్లాలని యెందుకనుకుంటున్నావ్? నేను చెపుతున్నా నువ్వు తిరిగి కులాసాగా ఉంటావ్...

రమ :-రమేశ్...నేను కులాసాగా ఉండేవిషయం ఆలోచించటంలేదు. కేవలం వెళ్ళేవిషయాన్ని గురించే ఆలోచిస్తున్నా...కాని నా యీ కోర్కెనుకూడా మీరు తీర్చవలసి ఉంటుంది. నన్నుగురించి మీరు యెప్పుడూ పెద్దన్నయ్యతో పోట్లాడకండి...

రమే :-అంటే...

రమ :-అర్థం యెప్పుడైనా తెలుసుకుందురుగాని...కేవలం యిదిమాత్రం జ్ఞాపకం ఉంచుకోండి. నేను యేవిధంగా మాట్లాడకుండా సహించిపోయినదీ, ఏ మాటకూ యెదురుచెప్పకుండా ఉన్నదీ...యీ విషయాన్ని మాత్రమే జ్ఞాపకం పెట్టుకోండి. ఒకరోజున నాకు అసహ్యం వేసినప్పుడు, పెద్దమ్మవచ్చి 'మిథ్యను ఆందోళనచేసి మేల్కొల్పి ఉంచటంవల్ల దానిఆయువు వృద్ధిచెందుతుందని, తన సహించలేనితనంతో దాని ఆయువును వృద్ధిచేయటంకంటె మహాపాతకం లేదని' తెలియచెప్పింది. ఈ ఉపదేశాన్ననుసరించే దుఃఖాలనన్నింటినీసహించి,కష్టాలు

గడిచి గట్టెక్కాను. రమేశ్...ఈ విషయం మీరుకూడా యెన్నటికీ మరచిపోరుగా...

(రమేశ్ మాట్లాడకుండా ఆమె మొగంవైపు చూస్తూంటాడు)

రమ :-రమేశ్... ఇవ్వాళ నన్ను క్షమించలేకపోయానే అని మీరు విచార పడనక్కరలా...ప్రస్తుతంలో కష్టంగా కనబడ్డ విషయమే, ఒకా నొకరోజున సహజంగానూ, మామూలుగాను కనపడుతుంది. ఆ రోజునే మీరు నా తప్పులన్నింటినీ క్షమించగల్గుతారు. ఈ నమ్మిక కారణంగానే నా హృదయంలో విచారంగాని దుఃఖంగాని లేదు... నేను రేపు ప్రొద్దున్నే వెళ్ళిపోతున్నా...

రమే :-రేపు ప్రొద్దున్నా ? ఎక్కడికి ?

రమ :-పెద్దమ్మ ఎక్కడికి తీసుకు వెడుతుందో...అక్కడికి...

రమే :-మళ్లీ ఆవిడ తిరిగిరాదని విన్నానే...

రమ :-నేనూరాను... ఇవ్వాళ మీ పాదాలవద్ద శాశ్వతంగా శెలవు తీసు కుంటున్నా...

(ఈ మాటలే అని రమ తల నేలమీదకువంచి నమస్కారంచేస్తుంది...)

రమే :-సరే...వెళ్ళు...ఈ విధంగా అకస్మాత్తుగా ఎందుకు వెళ్లిపోతున్నావో ...ఇదైనా నేను తెలుసుకోవచ్చా ? (రమ మాట్లాడదు)

రమే :-నువ్వు నీ విషయాలన్నీ యీ విధంగా దాచిపెట్టి ఎందుకు వెళ్ళిపో తున్నావో...ఆ విషయం నీకే తెలియాలి... ఒకరోజున నిన్ను మనః పూర్వకంగా క్షమించేట్లు చేయమని భగవంతుని, నేనుకూడా మనో వాక్కాయకర్మలతోసహా ప్రార్థిస్తున్నాను. నిన్ను క్షమించలేకపోవ టంవల్ల నాకు కలుగుతున్న బాధఏదో నా అంతర్యామికే తెలుసు.

(అకస్మాత్తుగా విశ్వేశ్వరి ప్రవేశిస్తుంది)

విశ్వే :-రమా !

రమే :-పెద్దమ్మా...ఏం అపరాధం చేశామని యిలా మమ్మల్నందరినీ వదిలి వెళ్ళిపోతున్నా ?

విశ్వే :-అపరాధమా ?...నాయనా...వీటివిషయం చెప్పేటట్లయితే దానికి అంతమే ఉండదు. అందువల్ల దీనిఅవసరంకూడాలేదు. కాని నేను చెప్పేవిషయంమాత్రం జ్ఞాపకం ఉంచుకో... రమేశ్ ఒకవేళ నేను

యిక్కడ చచ్చిపోతే, వేణీ నన్ను దహనంచేస్తాడు. దానివల్ల నాకు యే విధంగానూ ముక్తిఅంటూ ఉండదు. ఈ జీవితం అంతా కష్టాల తోనే గడిపాను. కాని రమేశ్... పరలోకంలోకూడా యీ విధం గానే గడపాలసి వస్తుందేమోననే భయంతోనే యిక్కడినుంచి పారి పోతున్నా...

రమే :-కొడుకుచేసే దుర్మార్గాలు, అపరాధాలు అన్నీ యీ విధంగా నీ హృద యాన్ని వేధిస్తున్నాయని...యింతకు ముందెప్పుడు నాతో నువ్వు చెప్పలేదేం పెద్దమ్మా? పోనీ రమనైనా అన్నీ వదిలి ఎందుకనిపోతోంది? దానిని ఎక్కడికి తీసుకుపోతావ్ ?

రమ :-నేను వెడుతున్నా పెద్దమ్మా? (రమ వెళ్ళిపోతుంది)

విశ్వే :-రమ ఎందుకు వెళ్ళాలని అనుకుంటోంది? ఎక్కడికి తీసుకుపోతావ్ అని అడుగుతున్నావా? ఈ ప్రపంచంలో, దానికి స్థలందొరకలేదు రమేశ్...అందుకనే భగవంతుడి పాదాలవద్దకు తీసుకుపోతున్నా... అక్కడికి వెళ్ళినప్పటికీ, అది బ్రతుకుతుందో... లేదో... చెప్పలేను. ఒకవేళ బ్రతికినట్లయితే, మిగిలిన జీవితంఅంతా యీ కఠినప్రశ్నకు సమాధానం తెలుసుకోవటానికే వినియోగించమని చెపుతా. భగవం తుడు యింతటి అధికరూపం, సుగుణం, ఒక మహాప్రాణాన్ని యిచ్చి కూడా యీ ప్రపంచంలోకి పంపాడు. యే అపరాధం, తప్పులేకుం డానే, దాని నెత్తిమీద యింతటి దుఃఖాన్ని పారవేసి, ప్రపంచంనుంచి బయటకు గిరవాటేసాడు...ఇది ఆయన ఉద్దేశ్యమేనా... లేకపోతే మనసంఘపు నమ్మకల ఒక ఆటా... రమేశ్... దానిలాగ దుఃఖం అనుభవించినవాళ్ళు బహుశా యీ ప్రపంచంలో యింకా ఎవరూ ఉండరురా...

(విశ్వేశ్వరి కంఠం దుఃఖంతో పూడుకుపోతుంది. రమేశ్ మాట్లాడ కుండా ఆమెమొగంవంక చూస్తూంటాడు)

విశ్వే :-కాని...నాయనా రమేశ్... దానిని తప్పుగా అర్థం చేసుకోవద్దని మాత్రం నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. వెళ్లేముందు ఎవరిమీద నేను నింద వెయ్యదలచుకోలేదు...కాని అదితప్ప నీ సుఖాన్ని కోరేవాళ్ళు యీ పృథివిలో యింకెవరూలేరనే నా మాటను మాత్రం పొరబాటుగా నైనా నువ్వు యెన్నడూ విశ్వసించకుండా ఉండకు...

రమే :-కాని పెద్దమ్మా...

విశ్వే :-రమేశ్...ఇందులో కానీ...గీనీకి యేమీచోటులేదు నాయనా... నాయనా...నువ్వు విన్నదంతా వట్టిఅబద్ధం. కాని యీ అభియోగాన్ని యింతటితో ఆఖరుచెయ్...నీ కల్యాణాన్ని చేకూర్చే యీ పనులు పొంగిపారలే నదిలాగ, సమస్తద్వేష యీర్ష్యలను కొట్టుకునిపోతూ ప్రవహించాలనేదే, నీ విషయమై దాని అంతిమ ప్రార్థన...అందుకనే నోరుమూసుకుని అన్నింటినీ సహించింది...ప్రాణాలుపోతున్నాయ్... ఐనా మాటేచెప్పలేదు రమేశ్...

రమే :-పెద్దమ్మా...దానితోచెప్పు...

విశ్వే :-చెప్పగల్గితే నువ్వే దానితోచెప్పు నాయనా...నాకు యిక వేళలేదు...

(నిష్క్రమణ)

(యతీంద్రుడ్ని వెంటబెట్టుకుని రమ ప్రవేశిస్తుంది. ఆమె బట్టలు చూస్తే ఎక్కడికో దూరంగాపోతున్నట్లు అనిపిస్తుంది.)

రమే :-(ఆశ్చర్యపోయి) ఇదేమిటి ? ఇంతరాత్రిపూట యీ వేషందేనికి ?

రమ :-రమేశ్... నేను యాత్రకోసం యింటినుంచి బయలుదేరాను...ఇంకా ఎంతోరాత్రిలేదు. వెళ్లేముందు రెండుపనులు చేయవలసినవి ఉన్నాయ్ మొదటిది ఆఖరుసారి మీపాదధూళి తీసుకోవటం...రెండవది యతీంద్రుడ్ని మీకు వప్పగించటం...

రమే :-ఈ బరువును నా మీద నేపడవేసి పోతావా రమా ?

రమ :-రమ కాదు...రాణీ... దానికి అన్నింటికంటె ప్రాణధనం యీ చిన్న తమ్ముడు. రమేశ్ ! వాడిని మీకుతప్ప యింకెవరు తీసుకోగల్గుతారు?

రమే :-కాని యిందులో ఎంతోజవాబుదారీఉంది రమా—ఈ బలవంతం...

రమ :-మళ్ళీ అదే రమా ?...కాని యిది బలవంతం కాదు. ఇది ఆమె హక్కు ఈ హక్కుతోనే ఒకనాడు యీ ప్రపంచంలోకివచ్చింది. ఈ హక్కుతోనే దానినుంచి బయటకుపోతుంది. రమేశ్ యీ హక్కుకు ఎక్కడా అంతం అంటూలేదు. దీనినుంచి మీ రెలాతప్పించుకుంటారు? తీసుకోండి...

(రమేశ్ చేతిలో యతీంద్రుడి చేయి పెడుతుంది. నేలమీదకు వంగి నమస్కారం చేస్తుంది)

[తెర]



జెమిని ప్రింటర్స్, పవరుపేట - ఏలూరు



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA104B145 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 113 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | Hema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | good |